సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 1

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

ఏప్రిల్ 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రాప్రు[illegible]టరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 31 | ఏలూరు 15 ఏప్రెయిల్ 1942 | సంచిక 1 |
|---|---|---|


# నిత్యసంకీర్తనము

వివరణము :

ప్రకృతి మనకెన్నియో మహత్తర విషయముల బోధించును. కాని వానిని గ్రహించుటకు తగిన యాంతరంగిక జ్ఞానమావశ్యకమై యున్నది. ఒక్కొక్క దానిపై మనసును దెలిచిన కొలది నూతనవిషయములు బోధపడుచుండును. ఇదియే దానిలోని రహస్యము. అది లభించినపుడు మనుజుడు తనవెనుక నొక గొప్పయాధ్యాత్మిక సాంప్రదాయము, ఒక గొప్ప దివ్యశక్తి, యున్నదని గ్రహించును. ఈ దివ్యజ్ఞానమును మనము స్వయంకృషిచేతనే పొందవలయునుగాని మఱొకరు తెచ్చిపెట్టలేరు.

సంకీర్తనము :

1. ఓహృదయాంతర్వర్తీ ! నాచిత్తమీప్రపంచ విషయములనుండి వదలి స్వచ్ఛమైన నీ స్వరూపము ప్రతిబింబించుటకు యోగ్యమగునట్లనుగ్రహింపుము.
2. ఈయజ్ఞానమను ఘోరాంధకారమును నివారించి నా స్వస్వరూపమును గ్రహించు విజ్ఞానమునిమ్ము.

—స్వామి పరమానంద

---

# దీవన

శ్రీమాన్ కొ. వేం. కృష్ణమాచార్యులు

సతిసీత రఘురాము సతతంబు మదిఁగొల్చి
శ్రీధర్మమిలలోనఁ జెప్పుచుండ
రఘురాము పదసేవ యఘమునంతటిఁ బాపు
ననిలక్ష్మణుఁడు ఛత్రమమర వేయ
ననుజన్మలటు లేకమయి చామరాల్వీచి
భరతశత్రుఘ్నులు భక్తిఁగొల్వ
ననయంబుఁ బ్రభుభక్తి తనయందు నిగుడంగ
హనుమంతుఁ 'డిదె దేవుఁ' డనినుతింప
గనకమణిమయపీఠాన గార్ముకంబు
శరము, కరమున మెఱయ సొగసుమీఱి
శాంతిపుంభావమై దివ్యకాంతి వెలుఁగు
నట్టి శ్రీరామచంద్రుడు సార్వభౌముఁ
'డాంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య' మనఁబ్రోచుఁ
జిరతరానంద సద్యశశ్శ్రీలసతము.

---

# పద్యబోధనము

(మాదిరిపాఠము)

వంగర సూర్యనారాయణ
హెడ్మాష్టరు - హిందూ ఎలిమెంటరీస్కూలు, రావెల.

తరగతి 5
**కాలము : 45 నిమిషములు**
తేదీ 5—4—1942.
ఉపకరణములు : నల్లబల్ల.

ఉపాధ్యాయుని పేరు.
విషయము—తెలుగు భాష
పాఠము—నీతిపద్యము.

ఉద్దేశములు : (1) బాలురకు భాషాభివృద్ధి కలిగించుట. (2) పద్యమందలి నీతి వారిమనస్సులలో నాటజేయుట. (3) పద్యతాత్పర్యమును వారిచే సరళ వాక్యములలో చెప్పించుట. (4) ముఖ్య వ్యాకరణాంశములు దెలుపుట.

| అంశము | పద్ధతి |
| --- | --- |
| **I. ప్రవేశము**<br>I. మనుష్యుడు తన తల్లిదండ్రుల యెడలను, పెద్దల యెడలను వినయము కలిగి ప్రవర్తించవలయును. | 1. మనుష్యుడెట్లు ప్రవర్తింపవలెను? అని ప్రశ్నించి బాలురచే రాబట్టుదుము. |
| II. వినయము గలవాడు, విద్యయు, సిరియు, లేనివాడైనను దుదకు బాగుపడును. | 2. వినయము వలన లాభమేమి? |
| III. వినయము లేనివాడు గొప్పవిద్యయు, సంపదయు గలవాడైనను దుదకు జెడిపోవును.<br>ఉద్దేశము: దుర్నీతి పరుడెంతటి ధనమును, విద్యయు గలవాడైనను, దుర్మార్గవృత్తిచే దుదకు జెడిపోవునని దెలిపెడి పద్యమును, ఈదినమున నేర్చుకొందము. | 3. వినయము లేకుండిన చో, నష్టమేమి? |
| **II. ప్రదర్శనము**<br>చదువుట: ఉచ్చారణ:<br>పద్యము<br>I. క. వినుదుర్వినయాత్ముండగు<br>జనుఁడుజ్జ్వలమైన, సిరియునద్విద్యయుగ<br>ల్గిన నందు వెలుగ నేరక<br>చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ<br>దుదిన్. | (అంశమును గడిలోనున్న) ఈ పద్యమును నల్లబల్లపై వ్రాసి అర్థమగునట్లుగాను, సజీవముగా నుండున ట్లాపవలసిన చోట్ల నాపుచు, సమయమునుబట్టి గంఠమును మార్చుచు ఉపాధ్యాయుడు మాదిరిగా చదివి తరువాత బాలురచే చదివించుచు, యందలి లోపములను ప్రక్క బాలురచేతనే దిద్దింపవలయును. |
| II. పదవిభాగము సంధులను విడదీయుట. వినుము, దుర్వినయాత్ముండు, అగుజనుడు, ఉజ్జ్వలము, ఐనసిరియున్ సద్విద్యయున్, కల్గినన్, అందున్, వెలుగన్, నేరక, చెనటి, తెఱంగునకున్, చొచ్చి, చెడి, పోవున్, తుదిన్. | ఈ అంశములోని పదవిభాగమును గూర్చియు, సంధులను గూర్చియు సాధ్యమైనంతవరకు ప్రశ్నించి బాలురవలన సమాధానములను రాబట్టవలయును. |

| అంశము | పద్ధతి |
| --- | --- |
| **సంధి విడదీయుట**<br>దుర్+వినయ+ఆత్ముఁడు = దుర్వినయాత్ముఁడు, ఆత్ముఁడు+అగు=ఆత్ముఁడగు, జనుడు+ఉజ్జ్వలను =జనుడుజ్జ్వలము,సత్+విద్య=సద్విద్య. | |
| **III. కఠినపదములు-అర్థములు**<br>దుర్వినయాత్మకుడు = దుర్నీతిగల మనస్సుగలవాడు "దుర్వినయాత్మకుని జనులు దూషింతురు" ఉజ్జ్వలమైన = అధికమైన, "శ్రీరామునికి గణితమున నుజ్జ్వలమైన పాండిత్యము గలదు" సద్విద్య= మంచిచదువు "ప్రతిమనుజుడును సద్విద్య నభ్యసింపవలెను" చెనటి = కుత్సితుడు= దుర్మార్గుడు "గోపాలుడు చెనటిసహవాసముచే చెడిపోయెను. చొచ్చి = ప్రవేశించి "చోరులు కొండగుహలో జొచ్చిరి". | ఈ అంశములోని కఠిన పదముల కర్థములను ప్రశ్నించియు బాలుర యనుభవములననుసరించియు యుదాహరణముల నిచ్చియు బదములను వాక్యములలోఁ బ్రయోగింపఁజేసియుఁ బ్రత్యుత్తరములను రాఁబట్టవలయును. |
| **IV. పద్య తాత్పర్యము**<br>నీతిమాలినవానికి సంపదయు విద్యయు నెంతయున్నను బ్రకాశింపక వాడు దుర్మార్గమవలంబించి తుదకుఁ జెడిపోవును. | బాలురను ప్రశ్నించి సరసమైన వాక్యములలో భావముఁ రాబట్టి నల్లబల్లపై వ్రాయవలయును. |
| **V ప్రోక్తపదముల యభ్యాసము**<br>దుర్వినయము-దుర్జనుడు- దుర్మార్గము- దుర్వినయము×సద్వినయము- దుర్వినయాత్మకుడు = అవినీతిపరుడు. సిరి, సంపద, లక్ష్మి, ఐశ్వర్యము, విభవము- చెనటి- కుత్సితుడు-దుర్మార్గుడు, తెఱంగు-విధము- రీతి-చందము-కైవడి. | బాలురను ప్రశ్నించి, తెలియనిచోఁ జెప్పియు గ్రహింపజేయును. |
| **VI. వ్యాకరణాంశములు**<br>విను క్రియాపదము. దీనికర్తృపదము నీవు. జనుఁడు-కర్త: చెడిపోవున్ (సమాపక) క్రియ కలిగి (వెలుగ) నేరక-చొచ్చి అసమాపక క్రియలు. దుర్వినయాస్తకుడు (అగు) జనుండను దానివిశేషణము. | బాలురను ప్రశ్నించియు నుదాహరణముల నిచ్చియు సమాధానములను రాబట్టవలయును. |

III. అంత్యపరీక్ష—తిరుగదోడుట

1. నీతిమాలినవానికిగల యే మంచి లక్షణములు వ్యర్థములగును.
2. తుదకతడెందుచే జెడిపోవును.
3. దుర్వినయాత్ముడు, సద్విద్య, చెనటి వీని యర్థము లేవి.
4. ఈ పద్యమందు ప్రధాన కర్తృపదమును గ్రియాపదమును దెలుపుము.
5. దుర్వినయాత్ముడు, సద్విద్య, సంధులు విడదీయుడు.
6. సిరి, వీటికి పర్యాయ పదములను వ్రాయుడు.
7. ఈ పద్యభావమేమి.

ఈ ప్రశ్నలకు సమాధానములను రాబట్టవలయును.

నల్లబల్ల సారాంశము

1. పద్యము, 2. కఠినపదములు, వానియర్థములు 3. క్రొత్తపదములు 4. వ్యాకరణాంశములు 5. పద్యభావము.

---

# శబ్దదోషములు

వేదుల అన్నయ్యశాస్త్రి

[సామాన్యముగా వ్యాసములను వ్రాయునపుడు విద్యార్థులును, సామాన్య భాషాజ్ఞానముగల యుపాధ్యాయులు కొన్నియెడలను, ఉపాధ్యాయులలో ముఖ్యముగా నాంగ్లభాషాపరిచయ మెక్కువగాఁగలిగి మాతృభాషాజ్ఞానము చాల తక్కువగా నున్నవారు సార్వత్రికముగను, ఇట్టి శబ్దదోషములకు గురియగుచుందురు. అట్టివారి సౌకర్యముకొఱకు ఈ శబ్దదోషముల పట్టిక కూర్పబడినది.]

*　　*　　*

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| విధ్య | విద్య | అనేకమంది | పెక్కుమంది |
| బక్తి | భక్తి | అనేకరకములు | పలురకములు |
| విధ్యార్ది | విద్యార్థి | బహుగొప్ప | మిక్కిలిగొప్ప |
| చూయించు | చూపించు | దురాదృష్టము | దురదృష్టము |
| ఊరులోపల | ఊరిలోపల | ఉతకృష్టము | ఉత్కృష్టము |
| చేసుకొని | చేసికొని | తెలవదు | తెలియదు |
| తీసుకొని | తీసికొని | రాపించెను | వ్రాయించెను |
| వ్రాసుకొని | వ్రాసికొని | పలహారము | ఫలాహారము |
| నేయిచెంబు | నేతిచెంబు | దేశస్తులు | దేశస్థులు |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| దారుఢ్యము | దార్ఢ్యము | పూరక | ఊరక |
| పూర్వీకులు | పూర్వికులు | అమ్ముమ్మ | అమ్మమ్మ |
| కస్టము | కష్టము | ఆచార్లు | ఆచార్యులు |
| ప్రతిష్ట | ప్రతిష్ఠ | వుత్తరము | ఉత్తరము |
| శెలవు | సెలవు | సిరము | శిరము |
| అతను | అతడు | దురలవాటు | చెడ్డయలవాటు |
| ఇతను | ఇతడు | దుర్నడత | చెడునడత |
| ప్రాముఖ్యత | ప్రాముఖ్యము | సీతలము | శీతలము |
| వాటిని | వానిని | అయికమత్యము | ఐకమత్యము |
| పుస్తుకము | పుస్తకము | స్వాతంత్ర్యత | స్వతంత్రత లేక |
| దేముడు | దేవుడు | | స్వాతంత్ర్యము |
| సుబ్రము | శుభ్రము | బాలులు | బాలురు |
| సూద్రుడు | శూద్రుడు | తెలుసును | తెలియును |
| భాద | బాధ | స్మశానము | శ్మశానము |
| బేధము | భేదము | యింటికాడికి | ఇంటికడకు |
| నరశింహ్వాము | నరసింహాము | వొళ్ళు | ఒడలు |
| శెనగలు | సెనగలు | యిసక | ఇసుక |
| యీరమ్మ | వీరమ్మ | వుడత | ఉడుత |
| యెంకయ్య | వెంకయ్య | వోడ | ఓడ |
| గ్రామస్తులు | గ్రామస్థులు | లెఖ్ఖ | లెక్క |
| శ్లాఖించు | శ్లాఘించు | రొఖ్ఖము | రొక్కము |
| చలము | చెలము | గుఱ్రము | గుఱ్ఱము |
| క్రిష్టయ్య | కృష్ణయ్య | కఱ్ర | కఱ్ఱ |
| అభద్దము | అబద్ధము | కూర్చొని | కూర్చుండి |
| కౄరుడు | క్రూరుడు | నిలుచుండి | నిలిచియుండి లేక |
| అమ్రుతము | అమృతము | | నిలువఁబడి |
| మేఖము | మేఘము | భెమ్మ | బ్రహ్మ |
| మధ్యాన్నము | మధ్యాహ్నము | | |
| పూరు | ఊరు | | |

—సశేషము

# సృష్టిపరిశీలనము - ప్రశ్నోత్తరములు

(నాల్గవ తరగతి)

వేదుల అన్నయ్యశాస్త్రి, & తాతా జగన్నాధరావు

## తోటపని:

Syllabus Heading — Planning the garden and laying out the garden. Preparation of the soil, laying out of the plots, making a garden path

1. తోటవేయబడుస్థల మెట్టిదిగా నుండవలెను ?

జ:—తోటవేయుస్థలము పల్లముగానుండరాదు ఇసుకనేలయందు మొక్కలంతగా బెరుగవు. గావున అట్టి నేలను వండ్రుమట్టిబోసి బాగుపరచవలెను తోటకు గరపనేల మిగుల అనుకూలించును మంచి నీటివసతులు గలిగియుండవలెను.

2. బడితోట యననేమి ? దాని ప్రయోజనమును వివరింపుము ?

జ:—బడిలో వేయబడుతోటకు బడితోటయని పేరు బడితోటలలో, గృహోపవనములలో వలె రమ్యతయే ప్రధానముగ నుండరాదు బాలురను బడికాకర్షించుటయు, బడికితోటవలన అందము వచ్చుటయు, బాలుర ప్రకృతి పరిశీలనా జ్ఞానాభివృద్ధి యగుటయు ప్రధాన ప్రయోజనములు యిందువలన బాలురకు తోటపని స్వయముగా చేయుట అలవడును. బడికివచ్చుటకు శ్రద్ధ, ఉత్సాహము యినుమడించును చేతిపనులు చేయుట పరువుతక్కువయను అభిప్రాయము తొలగును.

3 బడితోటయందలి ముఖ్యభాగములేవి ?

జ:—తరగతితోటలు, ప్రయోగపుమడి, పండ్లతోట, శృంగారవనము, పాదులకు ప్రత్యేకస్థలము, రెండుమూలలందు పెంటగుంటలు, మూడవమూల నీటిగుంట, నాల్గవమూల అరటితోటయు నుండవలెను.

4. బడితోట నమూనా వ్రాయుము ?

జ:-



5 సాగుచేయుట అనగానేమి ?

జ. నేలను ఆవశ్యకమగు పనిముట్లచే త్రవ్వి మొక్కల వ్రేళ్లు సులభముగా భూమిలో అల్లుకొను నట్లు బోలుగను, మృదువుగను చేయుటకే సాగుచేయుట అందురు.

6 భూమిని దున్నుటవలన గల లాభములేవి ?

జ. భూమిని త్రవ్వి బోలుగాచేయుటవలన మొక్కలవేళ్లు సులభముగ భూమిలో అల్లుకొనుటకు వీలగుటయేగాక, భూమిపైనుండుచేతన పదార్థము భూమిలోనికి, భూమిలోని ఖనిజపదార్థము భూమ్యుపరి భాగమునకు వచ్చి ఆవశ్యకమగు మార్పుచెంది మొక్కలకు సిద్ధాహారము గల్గును. మరియు నేలయందలి కలుపుమొక్కలు వ్రేళ్లతోగూడ పెల్లగించబడి చచ్చి, కుళ్లి, ఎరువుగానగుటయు, మొక్కలకు హానికరము లగు కీటకములు నశించుటయు జరుగును

7 తోటపనిచేయుట కావశ్యకమగు పనిముట్లేవి ?

జః పార, గునపము, గండ్రగొడ్డలి, త్రవ్వుకోల, పండ్లస్పేడు, నీళ్ళుపోయుటకు బక్కెట్టు, కత్తెర, చాకు, తట్ట, కొడవలి మొదలగు పనిముట్లావశ్యకము.

8. మడుల నెట్లు విభజించవలెను ?

జ తరగతికంతె కొక మడియనియు, గుంపునకొక మడియనియు, ఒక్కొక్కని కొక్కొక్కమడి యనియు మూడువిధములుగ విభజించవలెను.

9 నారు మడి నెట్లు తయారుచేయవలెను ?

జః బాగుగా త్రవ్విననేలను ఎండనిచ్చి, మట్టిబెడ్డలను మెత్తగా నలగకొట్టి తిరిగి పారతో త్రవ్వి కొన్నిదినములెండనియ్యవలెను.

10. బడితోటయందలి నడక బాటల విషయమున నెట్టి శ్రద్ధగైకొనవలెను ?

జః బడితోటయందలి ఆవరణచుట్టును కొంత స్థలమువిడచి బాట ఏర్పాటు చేయవలెను. తోటకలంకారము గల్గుటకు వివిధరకముల పూల మొక్కల గోలెములను బాటల ప్రక్కల నుంచవలెను. తోటయొక్క ముఖద్వారమువద్దను, బాటలపైనను వెదురుబద్దలతో ఆర్చిగట్టి రమ్యమగు లతలను ప్రాకించ వలెను. బాటల అంచులవద్ద పచ్చిక పెంచి కత్తిరించుచున్నయెడల అందము హెచ్చును. సున్నములో ముంచిన రాళ్ళు పేర్చినచో కడురమణీయముగా నుండును.

Syllabus Heading —Selecting what is to be grown in the garden. Planting, cultivation, Transplanting, Method of propagation of plants by cuttings

1 మంచి విత్తనము లెన్నుట యెట్లు ?

జ' గుప్పెడు గింజలను దీసి నీటిలో వేయుము ? పొల్లుగింజలు నీటిపై తేలును. గట్టిగింజలు నీటిలోమునుగును బాగుగామొలకెత్తునవి గట్టిగింజలు. నూటికి 90 గింజలు సరియైన కాలమునకు, అన్నియు ఒకేసారి మొలకెత్తక పోయినచో విత్తనము మంచిదికాదు.

2 మంచి విత్తనములనెట్లు జాగ్రత్తపెట్టదగును ?

జ' బలిష్ఠముగ పెరిగిన మొక్కలగింజలనుదీసి, వాటిచైతన్యము చెడకుండ కాపాడుటయు, అన్య ప్రదేశములనుండి విత్తులను దెప్పించు కొనుటయు, విత్తనములను జాగ్రత్తపెట్టుటయందు గమనించవలసిన ముఖ్యాంశములు

3 విత్తనములు జల్లుటలోగల పద్ధతులేవి ?

జః వెదజల్లుట, ఊడ్చుటయను రెండు పద్ధతులుగలవు.

4 వెదజల్లుట, ఊడ్చుట యననేమి ?

జః కొన్నిపైరులలో విత్తనములు జల్లబడి, అవియానేలయందే మొలకెత్తి, పెరిగి పంట నిచ్చును. ఆమొక్కలనుతీసి వేరొకచోట నాటరు. (ఉదా:- పెసర, కంది, ఉలవ etc) దీనినే వెద జల్లుట యందురు.

కొన్ని పైరులలో విత్తనములు ప్రత్యేకనారుమడులలో జల్లబడి నారు మళ్లలోని విత్తనములు మొలకెత్తిన పిమ్మట వాటిని మరియొకచోట విశాలముగా నాటుదురు దీనికే ఊడ్చుటయని పేరు (ఉదా: మిరప, చోడి, వంగ, పొగాకు, వరి etc)

5 విత్తనములు మొలకెత్తుటకు కావలసిన ముఖ్యాంశములేమి ?

జ. విత్తనము మొలకెత్తుటకు గింజయందలి బీజాంకురము బ్రతికియుండుటయు, తగినంత తేమ, గాలి, వేడిమియుండుటయు ముఖ్యము

6 ఏకదళ, ద్విదళ బీజములన నేమి ? ఉదాహరణలిమ్ము ?

జ: ఏకదళబీజముల కొనవద్ద మెత్తగా బీజాంకురమును, దీనినంటి పలుకును యుండును. యీ గింజలలో ఒకటేపలుకు లేక పప్పుబద్దగలదు. యీ బీజముల మొక్కలకు తల్లివేరు కన్పించదు. వీటి వేళ్లు నారవలెయుండుటచే నారవేళ్లనియు, గుబురువేళ్లనియు బిలుతురు (ఉదా - వరి, జొన్న, కొబ్బరి, తాటి etc) ద్విదళబీజముల బీజాంకురమునంటి రెండు పప్పుబద్దలుండును యీబీజముల మొక్కలకు తల్లివేరు, ప్రక్కవేళ్ళు, పిల్లవేళ్లు యుండును (ఉదా:-మామిడి, సెనగ, చింత, చిక్కుడు etc)

7 పునరుత్పత్తి యననేమి ?

జ.- పునరుత్పత్తి యనగా తనను బోలినవానిని బుట్టించుటయని యర్థము.

8. మొక్కలలో పునరుత్పత్తి ఎట్లు జరుగుచున్నది ?

జ: గింజలను పాతుటవలనను, అంట్లు కట్టుటవలనను, కొమ్మలను పాతుటవలనను, పిలకలను పాతుటవలనను, మొక్కలలో పునరుత్పత్తి జరుగుచున్నది.

9. అంటు త్రొక్కుట యననేమి ?

జ: కొన్ని మొక్కల కొమ్మలను వంచి నేలమీద ఆనియుండునట్లు రాతినిగాని, మంటినిగాని బరువుపెట్టి ఒకటి రెండు నెలలపిమ్మట చూచినచో అచట వ్రేళ్ళుద్భవించును తరువాత ఆమొక్కనుండి కొమ్మను నరుకుపెట్టి, కొమ్మవాడిపోకుండా చిగుర్చునది, లేనిదీ పరిశీలింతురు చిగిర్చినచో కొమ్మను నరకి వేయుదురు. యీపద్ధతికే అంటుత్రొక్కుటయందురు. (ఉదా'- గులాబి, మల్లె, ద్రాక్ష etc)

10. అంటుకట్టుటవలన గల లాభములేమి ?

జ: ఇందువలన మొక్కలు త్వరలో రుచికరమగు పెద్దకాయలు కాయుట సంభవించును

Syllabus Heading:—Manures and manuring. An elementary knowledge of the soil, the soil as a store house of food.

1. ఎరువులనగానేమి ? అందలి రకములేవి ?

జ: చెట్లకు కావలసిన ఆహారపదార్థములు గలిగిన వస్తువులకు ఎరువులందురు. భాస్వరములు, పొటాషియములు, నత్రజనములు అని మూడువిధముల ఎరువులు గలవు.

2. నత్రజనములనగా నేమి ? అవియేవి ?

జ: చేతనపదార్థముగల ఎరువులకు నత్రజనములని పేరు పచ్చిఎరువు, గొడ్లఎరువు, ఆకుఎరువు, కృత్రిమనత్రజనములని నాల్గు విధములుగా నత్రజనములు గలవు

3 నత్రజనము లేయే పైరుల కవసరము ?

జ: తోటకూర, గోంగూర మొదలగు ఆకుకూరలిచ్చు మొక్కలకు నత్రజని ఎక్కువగా గల ఎరువు లవసరము.

4. భాస్వరములు, పొటాషియము లననేమి ? ఆ ఎరువులేయే పైరుల కుపయోగపడును ?

జ: భాస్వరము ఎముకలపొడియందును, గొడ్లమూత్రమందును, చేపల పొట్టునందును, గింజల పిండియందును గలదు. చెరకు, వరి, జొన్న, పండ్లచెట్లకీఎరువు నుపయోగింతురు

పొటాషియము సంబంధముగు లవణ పదార్థము కర్రబూడిద, పిడకలబూడిదలలో గలదు. పొగాకు, వంగ, మిరప మొదలగువాటి కీఎరువ నుపయోగింతురు

5. నేలయనగానేమి ? అది ఎట్లేర్పడుచున్నది ?

జ: భూమియొక్క పైపొరను నేలయనిపేరు గాలి, మంచు, ఎండ, వర్షములచేత పర్వతములు శిథిలమై, నీటిప్రవాహములతో కొట్టుకొని వచ్చుటచేత నేల ఏర్పడును.

6. నేలల రకములెన్ని ? అవిఏవి ? వాటికాపేర్లెట్లు గల్గెను ?

జ: నేలలలో ఇసుకనేల, బంకమట్టినేల, చవుడునేల, ఒండ్రునేల, నల్లరేగడినేల, ఎర్రచెక్కనేల యను పలురకములుగలవు నేలలలోని అంతర్భాగములనుబట్టియు, రంగులను బట్టియు పేర్లు గల్గుచుండును.

7. నేలల సారము నెట్లు నిర్ణయింపదగును ?

జ: నేలలలోని చేతనపదార్థము, లవణపదార్థము, జలగ్రహణశక్తి, జలధారణశక్తులను బట్టి నేలలసారము నిర్ణయించవచ్చును.

8. సస్యానుకూలమగు నేలయేది ? ఏల ?

జ: ఇసుక, బంకమన్నులు సమానపాళ్లలోగలిగి. జలధారణ, జలగ్రహణశక్తులుగలిగి యుండెడి ఒండ్రుమట్టి నేలయే సస్యానుకూలమైనది.

9. నేలను "స్టోరుహౌసు" అని ఏలపిలువవలెను ?

జ: ప్రాణవాయువు, జలవాయువు, నత్రజని, భాస్వరము, పొటాషియము, గంధకము, మెగ్నిషియము సున్నము, బొగ్గు మొదలగు వస్తువుల సారమును తనలో నిడుకొని మొక్కల పెంపున కత్యావశ్యకమగు నాహారపదార్థముల నొసగును వృక్షములను కన్నతల్లివలె పోషించుచున్న నేలను "స్టోరుహౌసు" అనిపిలువదగును.

Syllabus Heading — The study of the growth of common Vegetables found in the locality. To recognise and name the shrubs incuding flowering shrubs like the rose and oleander. Herbs and leafy Vegetables in the neighbourhood and their use.

1. వృక్షములనెన్ని జాతులుగా విభజింపదగును ? అందలి వివిధరకములేవి ?

జ: వృక్షములను దేశీయములనియు విదేశీయములనియు రెండురకములుగావిభజింపదగును అందు ఫలవృక్షములు,చిన్నచెట్లులేక తుప్పలు, తీగెలు, దుంప జాతులు, ఆకుకూరలు అను వివిధ రకములుగలవు.

(సశేషము).

---

# హిందూదేశము - అందలి గంగానదీ మైదానము

ఏలూరు వెంకటరమణమూర్తి

1. గంగానది ప్రవహించు ప్రదేశము - దానిఉపనదులు.

హిందూదేశమున కుత్తరమున టిబెట్టులోని మానస సరోవరమునందు పుట్టి హిమాలయములను దాటి, ఢిల్లీ, ఆగ్రా, అయోధ్యా, కాశీ మొదలగు దేశముల మీదుగా ప్రవహించి కలకత్తావద్ద బ్రహ్మపుత్రతో కలసి బంగాళాఖాతములో కలియుచున్నది.

1. ఇందు గండకీ, కోసి, యమున, శోణా, చెంబల్ మొదలగు కొన్ని ఉపనదులు కలియుచున్నవి. ఈనది యీదేశములో ప్రవేశించినది మొదలు ముఖద్వారమువరకును, రాకపోకలకును, వ్యవసాయమునకును మిక్కిలి అనుకూలమై యున్నది. ఈనదీమైదానము మిక్కిలి ఒండుమట్టి గలిగినదగుటచేత సారవంతమై, జనసమ్మర్దమై, -ఠక్కు పంటలకును, దండయాత్రలకును కారణమైయున్నది.

2. సస్యాభివృద్ధికి కారణములు:— ఈ మైదానములో పడమటకు పోను పోను వర్షము తక్కువ. రానురాను తూర్పునకు వర్షమెక్కువ. నదీమధ్యభాగమున, తూర్పు భాగమున కాలువలు త్రవ్వనక్కరలేకయే కేవలము వర్షాధారముననే విస్తారపంటలు పండును. పడమట భాగమున, గంగా, యమునా నదులనుండికాలువలు త్రవ్వబడినవి. తూర్పుభాగమున వరి ముఖ్యమైనపంట. మధ్య, పశ్చిమములందు వర్షము తక్కువగుటచే చలికాలమందు గోధుమ, బార్లీయును, వేసవికాలమున వరియు పండును. గంగానదీమైదానమందు పండునంతవరి మరియీదేశములో నెచ్చటను పండదు.

3. ఈప్రాంతపు ప్రదేశములలోని పంటలు:— ఈ నదీమైదానమునందు వరి ముఖ్యమైనపంట. బెంగాలు గోజనుముముఖ్యపంట. గంగానదీమధ్యభాగమున(సంయుక్త పరగణాలు) శ్రేష్ఠమైన ప్రత్తిపండును. ఈనదీమైదాన మందంతటను చెరకుపండును బెంగాలు, నీలిమందుకును, బీహారు నల్లమందునకును ప్రసిద్ధములు.

4 ఈనదీప్రాంతపు పట్టణములు, అందలి పరిశ్రమలు:—

1. ఢిల్లీ - ఇండియాకు రాజధాని. చక్రవర్తిగారు పట్టాభిషేకము పొందిన స్థలము. రైల్వేమార్గములకు కేంద్రస్థానము. ఇచట కొన్నియంత్రములు, తయారగుచున్నవి. 4 దిశలకును అనగా కలకత్తా, పెషావరు, బొంబాయి, చెన్నపట్టణములకు పోవు రైలు మార్గములున్నవి; చల్లని ప్రదేశము.

2. ఆగ్రా - ఇందు మొగలాయి చక్రవర్తుల జ్ఞాపకచిహ్నములైన ఆగ్రాకోట, మసీదు, తాజమహాలు చూడతగినవై యున్నవి. ఇచట కంబళ్ళు, శాలువలు మొదలగునవి (తివాచీలు) తయారగును.

3. కాశీ, గయా, ప్రయాగ, అయోధ్యా యివన్నియు హిందువుల యాత్రాస్థలములకు ప్రధానమైనవి. ఈపట్టణములన్నియు నీనదిపైనున్నందున ఈనది బహు పవిత్రమైన పుణ్యానదియని పేరుగాంచెను. ఈపట్టణములు పట్టు, ఊలు, దంతము, ఇత్తడి మొదలగు పరిశ్రమలకు పేరుగాంచెను. పై కారణములచే నీమైదానము ధనధాన్యములతో తులదూగుచున్నది.

---

# కథాప్రాముఖ్యము

రచయిత : బలివాడ సత్యనారాయణ

సీ॥ ధ్యానశక్తియుఁ బరధ్యానవిరక్తియుఁ
గథల ప్రబోధనం గల్గుగాదె ?
యూహించు శక్తియు నుచ్చారణాసక్తి
కథల ప్రబోధనం గల్గుగాదె ?

క్రమశిక్షణాసక్తి కల్పనాశక్తియుఁ
గథల ప్రబోధనం గల్గుగాదె?
సంభాషణాసక్తి సర్వేశుసద్భక్తి
కథలప్రబోధనం గల్గుగాదె?
గీ॥ కార్యకారణ సంబంధగతులు గఱపు
పారశాలా ప్రయోజనపద్ధతులను
నలవడంజేసి యుత్సాహ మధిక మొసఁగు
నట్టిగాథల ప్రాముఖ్య మరయఁ దరమె? 1

ఉ. బాధితుఁ డించుకైన తనబాధ నెఱుంగఁడు దుఃఖితుండు త
ద్రోదన మెంచఁబోఁడు భవరోగప్రపూరితుఁ డాత్మసంశయ
చ్ఛేదమునొందు నింక నల చిహ్న నిసుంగును నేఁడ్పుమాని స
మ్మోదము నందు సత్కథలబోధనసుస్సుధ గ్రోలుచుండుటన్. 2

క. జ్ఞానము చేకూర్చెడు నను
మానముఁ దొలఁగింపఁజేసి మౌర్ఖ్య మడంచున్
జ్ఞానవిచక్షణ శక్తిని
దాన మనోభావములనుఁ దగఁ బ్రకటించున్ 3

క. భూతమ్ములయెడఁ గరుణయుఁ
జేతలయెడ సహనశక్తి చిత్తస్ఫురణల్
నూతన భావోద్రేకము
లేతఱిఁ గలిగించు గాథ లెప్పుడుఁ జదువుటన్. 4

గీ॥ మొదటితరగతి బాలుర హృదయసీమ
ఘృతముకరణిని యచ్ఛమై సతము మార్ద
వమున వెలయుట సత్కథావరము గఱప
నెంచవలయు నుపాధ్యాయుఁ డంచితగతి. 5

క. పాఠకుడు గఱప నెంచిన
పాఠంబులనెల్లఁ గథలపద్ధతిపైనన్
బాఠానుక్రమముగఁ దాఁ
బాఠంబులు గఱపవలయు బాలుర కెపుడున్. 6

క. ముక్తి న్బడయుటకును స
ద్భక్తియె సాధనము విద్య బడయుటకుఁ గథా
సక్తియె మూలక మను నా
ర్యోక్తిని పాటించి గఱపు టొజ్జలకుఁ దగున్.

# విద్యాస్వరూపము

విద్వాన్ వేమూరి చక్రధరస్వామి

**(1)** మనభావములను నితరులకు దెలుపవలయు నన్న నవయవ చలనాదులచే నితరులకు బోధపడునట్లు చేయుదుము. దీనినే భాషయందురు ఈ భాష మొదటినుండి యవయవ సంజ్ఞలతో వాడుకయందుండి క్రమక్రమముగా వాగ్రూపమున ప్రశస్తికెక్కినది. మొదట భగవంతునినుండి మనకు నవయవచలన సంజ్ఞారూపకమగు భాషయే యబ్బియుండవచ్చును. ఏలయన బిడ్డకు పుట్టినతోడనే హస్తాది యవయవములను చలింపఁజేయుచున్నాడు క్షుద్బాధకుఁ గిలకిలారావములఁ జేయుచున్నాడు. మూగవాఁడు తన మనోభావముల నితరులకు సంజ్ఞలచేతనే తెలుపుచున్నాఁడు. మనముసైతి మన్యదేశములకు వెళ్ళినపుడు వారిభాష రానియపుడు హస్తవిక్షేపాది సంజ్ఞలతోడనే మన భావములను తెలియజేయుచున్నాము మనమితరులతో మాట్లాడునపుడు మనభావము లుప్పొంగుకొలది మన ప్రయత్నము లేకయే మన హస్తాది యవయవములు కదలుచుండును అంతియగాక యితరుల ముఖవికాసాదులచేతనే సంతోషమును, వైవర్ణ్యాదులచేత కోపశోకములను, గనుగొనవచ్చును దీనివలన నితరుని భావములను గనుగొనువాఁ డేమాత్రము నేమఱక యాతనివైపుననే తనదృష్టి యుంచవలసిన యవసరమొకటి యుండుటచే క్రమక్రమముగా జ్ఞానవంతులు వాగ్రూపభాషావిశేషమును గనిపెట్టిరి

**(2)** ఈవాగ్రూప విశేషమైన భాషయు మనకు ననాది సిద్ధమైనప్పటికి నది యితఃపూర్వము నర్థవంతమగు వాక్కులు కాకపోవుటచేతను, ప్రతిశబ్దమునకు నేదియో యొక సంజ్ఞ నిర్ణీతముచేసి దానిని వ్యవహరించక పోవుటచేతను, భాషయని దానిని చెప్పుటకవకాశము లేదు. కాబట్టి జ్ఞానవంతులిట్టి శబ్దములకు సంజ్ఞల నేర్పరచి యర్థవంతములగునట్లొనర్చి భాషయను నామార్హతకల్పించిరి. లేకున్న మానవుని వాగ్రూప శబ్దములకును, బహుపక్ష్యాదిరుతములకును, భేదము లేకపోవలసి వచ్చెడిది మానవుడిట్టి శక్తిగలవాఁ డగుటచేతనే పశుపక్ష్యాదులకంటె నధికుఁడగుచున్నాఁడు

ఇట్టిధ్వని పూర్వోక్త భాషయందు గొంత కష్టమున్నది. ఏమనిన నొకఁడు మాట్లాడునపుడు వినువాఁడు తప్ప రెండవవాఁడు దాని భావమును గ్రహించుట కష్టము ఇట్టికష్ట ముండుటవలననే పూర్వులు గురుకుల బ్రహ్మచర్యాశ్రమము గడపుచు వేదాధ్యయనాది విద్యల నభ్యసించి గురువుకడ సెలవంది గృహస్థాశ్రమము స్వీకరించుచుండిరి. ఇప్పటికిఁగూడ మంత్రములను గురూ దేశమందిననే ఫలించునని యొక దృఢనమ్మకముగలదు. క్రమక్రమముగా నిట్టి రూపరహితములగు శబ్దములకుఁ గొన్ని చిహ్నరూపములను బుద్ధిమంతులు కనిపెట్టిరి దీనివలన వ్రాసినవాఁడు లేకున్నను, నాతనిభావమును రెండవవాఁడు సులభముగా గ్రహింపఁ గలుగుచున్నాఁడు

ఇట్టిమహాత్మ్యముగలది గావుననే పూర్వులు దీనికి, "తెలియజేయు" నను నర్థముగల "విద్య" యను నామంబిడిరి. ఇది మిక్కిలి పవిత్రమైనదని తెలియజేయుటకే మహేశ్వరుని ఢక్కనుండి గలిగిన "అఇఉణ్, ఋ౯క్" మొదలగుపదునాల్గు సూత్రములను దీనికి నాధారములని శాసించిరి సద్గుణసత్సంప్రదాయములను బోధించువానికి వేదములనిరి సమస్తధర్మములను ననుభవైక వేద్యముగాఁ జేయు నితిహాసమగు భారతమును పంచమవేదమనిరి మానవుఁడు నెరవేర్పవలసిన చతుర్విధ పురుషార్థములకీ వేదమే యాధారము దీని భావమునే భారతములో

తే॥ గీ॥ విద్యయొసఁగును వినయంబు
　　　　వినయమునను
బడయుపాత్రత పాత్రతవలనధనము
ధనమువలనను ధర్మంబుదానివలన
నైహికాముష్మిక సుఖంబులందు
　　　　నరుఁడు.

అనిచెప్పఁబడినది ఇట్టి విద్యాధనమును గలిగిన నరుఁడెచ్చట సంచరించినను గౌరవింపఁబడుచునే యుండును. ఆతనికి రాజాధిరాజులు సైతము వడఁకుచుందురు మహర్షులు తమ హృదయకుహరమందుండుపరమాత్మనునిట్టి విద్యాప్రభావమువలననే కనుగొనుచుందురు వేనుఁడు హతుఁడైన దిట్టిజ్ఞానుల వలననే. నహుషుఁడధఃపతుఁడైన దిట్టి జ్ఞానులను

దిరస్కరించియే కాన విద్యగలవారు దానిని సక్రమముగా వినియోగింపనిచో నందలి సుగుణపుంజములను దామనుభవింపక పోవుటయేగాక తమకు దామే నిందార్హులగుటకు మార్గమును గల్పించుకొనినవారగుచున్నారు కాఁబట్టి విద్యగలిగిన వారు సజ్జనులైననే దాని లాభమును బొందుదురనియు, దుర్జనులైనఁ దద్వ్యతిరేక ఫలము గలవారగుదురనియు భారతములోని

కం. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును స
జ్జనులైన వారికడఁకువ
యును వినయము నివియఁదెచ్చు నుర్వీనాథా.

యను పద్యముచేఁ దెలియుచున్నది కాన జ్ఞానియైనవాఁడు తన విద్యను సద్వినియోగము చేయుచుఁ దన్నాశ్రయించిన వారలకు మర్మములేక యుపదేశించుచు వృద్ధిఁబొందించి యశోవిభాసితుఁడగును కావుననే మానవునకుఁ గల ధనధాన్యాదులన్నియు నశించు స్వభావముగలవనియు, నట్టియవస్థకు లోబడక పురుష నలంకరించు నలంకరణమొక్క విద్యయేయనియు, "భర్తృహరి" పవిత్రవాణి, వాగ్భూషణమే సుభూషణము, భూషణముల్ నశియించునన్నియున్" అని చెప్పియున్నాఁడు కాన నిట్టి యమూల్యమగు విద్యనభ్యసింపని మానవుఁడు "విద్యావిహీనః పశుభిస్సమానః" అనులోకోక్తికి గుఱియై తన జీవితమును వ్యర్థపుచ్చుకొన్నవాఁడగును నేనొక వ్యక్తినని తలఁచు ప్రతిమానవుఁడును దన శక్తికొలఁది విద్యనభ్యసింపఁ బ్రయత్నింపవలయును.

---

# ఎంత బాగుంటుంది బాబూ!

( పి. నారాయణయ్య - మేర్లపాక )

"యుద్ధంవల్ల సహజంగా ఉపద్రవాలు సంభవించవచ్చును. అందుచే ప్రాణాలపైన ప్రీతిగల్గిన వాళ్ళందరు పట్టణం వదలి వెళ్ళవచ్చును." అని ప్రకటించారు ప్రభుత్వంవారు. మదరాసు నగరంలో దానికి పర్యవసానంగా కాలేజీలు, హైస్కూల్లు, యింకా తదితర విద్యాలయాలన్నీ మూసివేసినారు కాని ఎలిమెంటరీ పాఠశాలలు మాత్రం బళ్ళకు పిల్లలు రాకుండినాసరే, కార్పొరేషన్ వాళ్లు మాబళ్లు మూసేస్తామని మొత్తుకొనుచుండినాసరే, ససేమిరా యెంతమాత్రం మూయగూడదంటున్నారు డైరెక్టరు దొరగారు. అయ్యవార్లను బల్లలకు చదువుచెప్పుమనేదానికంటే, A. R. P. లో నిర్బంధముగా చేరి శిక్షను పొందాలనే ఫర్మానా జారీచేస్తే, రక్షణయేర్పాట్లలో బాగుగా తర్బీతు పొందేదేగాకుండా, కుక్షికి, మోక్షానికి కూడ సహాయముచేసినట్లుంటుందే! ఎందుకీ చాటు నాటకం! రంగస్థలానికి త్వరగావస్తే ఎంత బాగుంటుంది బాబూ!

యుద్ధంవలన ధరలు పెరిగినాయి. విదేశమునుండి దిగుమతి అయ్యేసరకులకేగాకుండా, దేశంలో దొరకే ఉప్పు చింతపండుకు గూడా ధరలు పెరిగాయి అంటారు బజారులో వర్తకులు. బజారులో బేరానికిపోతే యికమీద దినాలు జరిగేకొద్దీ పేదా, బిక్కీ జీవించగల్గుతారా అనేది అనుమానంగావుంటుంది. ఇదిగమనించి ప్రభుత్వము వారు అన్ని డిపార్టుమెంటులలోను నెలకు రూ 30/-తక్కువజీతగాళ్లకంతా నెలకొక రూపాయివంతున అదనంగా యిస్తూవున్నారు. కాని ప్రాథమికోపాధ్యాయులకు

మాత్రం అదనంగా యివ్వకపోయినా, ఇచ్చేకొంచను భత్యముకోను ఏదో పేరుబెట్టి కోతకోసినారే మాజిల్లాలో. ఈకష్టకాలంలో గూడ 'కోత'లు అంటే ఇంక బ్రతికేదెట్లా? దయయుంచి ప్రభుత్వమువారు పునరాలోచించి తగ్గించిన మొత్తాన్ని యిప్పిస్తే ఎంతబాగుంటుంది బాబూ!

---

# వృక్షవైచిత్ర్యము

[ పి నారాయణయ్య - మేర్లపాక ]

"మధ్వాజ్యలేపితే వృక్షే శైశవే సూత్రవేష్టితే।
ఏకీ భూయప్రసూయేత సితలోహితమంజరీ॥"

"ఎఱ్ఱ పువ్వులు, తెల్లపువ్వులుగల మొక్కలనుసుసుగా కోసి, అంటుకట్టినట్లుగానే ఆకాండములు కలిపి, మైనపువస్త్రముపైన వేసి, తేనియు నేయి పైనిపూసి, సూత్రము గట్టిగాచుట్టితే కాండములు కలిసి తెల్లని యెఱ్ఱనిపూవులు పూచును."

చెట్లకు అంట్లుకట్టుట యనునది యీకాలమున నవీన వృక్షశాస్త్రజ్ఞులు కనిపెట్టినదేగాదు. ఎన్నియోవేల సంవత్సరముల క్రిందట మునీశ్వరులు అంట్లుకట్టుటకు నేర్చిరను విషయము పైశ్లోకమునుబట్టి విశదమగుచున్నది. ఇదియేగాదు, యింకను నెన్నియో వృక్షవైచిత్ర్యములను చెప్పియున్నారు వాటిని పత్రికాధిపతి ప్రచురింప నిచ్చగించిన ప్రతిమాసమునను వెల్లడిచేయుచుందును.

వానివల్ల మనపూర్వులింతటి మేధావులు గదాయని మురుసుకొనుచు మూలగూర్చుండక, ఆవైచిత్ర్యములను మనముగూడ కల్పించి ఆనందము ననుభవించుట తగవు. ముఖ్యముగ ఎలిమెంటరీ పాఠశాలలందలి తోటలు ప్రభుత్వఫర్మానాల తృప్తిపరచుటకేయని తలచక, మనపూర్వుల విజ్ఞానమును చాటునవిగను ఉపాధ్యాయుల యుత్సాహమును వెల్లడిచేయునవిగను, తయారుచేయుట మన ఉపాధ్యాయుల కర్తవ్యమైయున్నది. దయయుంచి యీపత్రికా ముఖమున ఇకమీద వెల్లడిచేయువైచిత్ర్యములను సాధ్యమైనంతవరకు ఉపాధ్యాయులాచరణయందుంచ ప్రార్థన.

---

ఆత్మకథ

# 'రూపాయి'

నడింపల్లి వేంకటసుబ్బారావు

నేనుపుట్టింది ఒక కొండప్రదేశం దాపురనే ఒక బస్తీకూడా ఉంది ప్రపంచంలో కాలుపెట్టడంతోటే నన్ను చాలాదూరానయున్న భారతదేశానికి పంపారు యాత్ర చాలదూరమైనదే కాని నేను ఓడమీదకొన్నాను బొంబాయిలో కాలుపెట్టేవరకు నాకు సూర్యభగవానుని దర్శనంకాలేదు. నాకు

చుట్టు ఘోరమైన అంధకారంఆవరించింది నేనేం నిద్రించుచున్నానా ? అంధకార మావరించడానికి నేను నాకండ్లు బాగాతెరచాను ఇంకా అంధకారమే అపరిమితంగా ఇప్పుడు నాకు అర్థమైంది చీకటికొట్లోవున్నానని కాని ఖైదులోనైనా, అధికార్లు కిటికి అని పిలిచేటటువంటి కన్నమైనా వుండవలసింది లేకపోతే ఖైదీ శాశ్వతనిద్ర జెందుతాడు తిండిపెట్టడానికి మొదలగు అవసరకార్యములకు ఖైదీని బైటికి తీసుకువెళ్తారు అప్పుడు ఖైదీ సుఖంగా నిట్టూర్పువిడిచి సూర్యదేవునకు ప్రణమిల్లి కృతార్థుడనయ్యానని తలుస్తాడు కాని నాకు యీ స్వల్ప సౌకర్యాలుగూడ యివ్వబడలేదు మలమూత్రాలతోటి కొట్టు దుర్వాసనా పూరితమై చెడివుంటుం దనుకుంటారు. భగవంతుని దయవల్ల అటువంటి యిబ్బంది యేమి కలగలేదు కడుపు నిండితేగదూ పైయిబ్బందులు కలగడానికి అన్నం లేదు, నీళ్ళూలేవు నా అదృష్టవశాత్తు ఊపిరితో బొంబాయి చేరుకున్నాను

రాగానే టంకశాలలో మొహాన రాజుగారి ముద్ర, వెనక నామాంకితాలు వేశారు ఇంత త్వరగా వేషం మార్చుకోడం నాకు యిష్టంలేదు నా మోతెవినేటప్పటికి చూచేవాళ్ళకు కంపనమెత్తింది బహుశ పురాణాలల్లో చెప్పబడిన నరకయాతన వాళ్ళకు జ్ఞాపకమొచ్చివుంటుంది తప్పకుండా చచ్చిన శవాన్ని తప్పకుండ కాల్చివేయవలసిందే కాని బ్రతికున్నప్రాణులను అమాంతంగా నిప్పులో వేసి వేయించే నరపిశాచులు భవిష్యత్తులో ఎంత నరకయాతన ననుభవిస్తారో నేనుచెప్పనవసరంలేదు.

జాగ్రత్త ! అవతారపు మార్పుతో నేను నా కష్టాల్ని మరచిపోయాను ఆహా ! నానూతన రూపమెంత మోహనంగావుంది గతమునుగూర్చి యిప్పుడనుకోవడమెందుకు ? టంకసాలవాళ్ళమీద నాకు చాలకోపం మొదటవాళ్ళు నాచేతిలోచిక్కితేనా .............అనుకునేదాన్ని కాని యిప్పుడు వాంకి నేనే యిప్పుడు ధన్యవాదాలిస్తున్నా

అవతారంమార్పుతో నాగుణాలుకూడ మారినై ఒకప్పుడు "ఖైమలోపడితే బాగుండు" నని అనుకొనేదాన్ని కాని దైవకృపవల్ల యిటుఅటు తిరుగుటకు శక్తిరాగానే దేశాటనం చెయ్యాలన్నబుద్ధి గలిగింది ఇందులో నాఅపరాధం యేమీలేదు మనుష్యుల్ని చూడండి సృష్టిలోని ప్రాణులకెల్ల ఉత్తములని చెప్పుకుంటారు. అదినిజమే ధోవతి, ఉత్తరీయం, విభూతి ధరించేవరకుభక్తి, ధర్మములు, గలిగియుంటారు కాని సూటు, హేటు, కోటు వేసేటప్పటికి చేతిలో బ్రాందీసీసా, నోట్లో సిగరెట్ అనివార్యమౌతుంది మనుష్యులే యింత చంచల స్వభావులైనప్పుడు యింక నావిషయం వేరేచెప్పాలా ?

భారతదేశము అద్భుతమైంది సందేహంలేదు. ఇందువల్లనే యింగ్లీషువారు విడిచిపెట్టి వెళ్ళలేకపోతున్నారు ప్రజలుకూడ నాయందు చూపినంత ఉచ్యకత నోట్లయందు చూపడంలేదు. ఆఖరుకు యేమైందంటే చూడవలసిన క్షేత్రాలు, ప్రదేశాలు చూచాను

అందరు సుఖంగా జీవితం గడపాలనే తలుస్తారు. కాని అదికొందరికి మాత్రమే అబ్బుతుంది. అట్టి అదృష్టవంతుల సంఖ్యలో నేను చేరలేదు నాకు దురదృష్టపు రోజులే రాసినై. కొద్దిదినాలలో నేను ఒక ముసలిదానిపాలబడ్డాను చెడ్డరోజులు ప్రారంభమైనవి ఆమె నన్ను చీకటికొట్లో వేసింది ఆజోరుకు కొంచెంసేపు మూర్ఛపోయాను. తెలివిరాగానే నలుదిక్కులు చూచాను. అందులోచాలామందిఉన్నారు వాళ్ళు యెవరైనది, యేజాతిమాతలకు చెందినది గుర్తించలేకపోయాను చీకటికొట్లోతిరుగుతూండగా కాలుజారి ఒకడిమీదపడ్డాను అందులోనా తప్పేముంది వాడు యింకోవిధంగా అనుకొని "ఏం! కండ్లుపోయినయ్యా ? దారిలోఉన్న మనిషి కనపడటంలే ? అని గదమాయించి నా మెడమీద ఒకపెట్టుపెట్టాడు నాతలతిరిగిపోయింది "క్షమించండి. మళ్ళీ ఎప్పుడిల్లాచేయ్యను" అని బ్రతిమాలుకున్నాను ఇంకా "నేను మీవాణ్ణే మీవాణ్ణయిన నాపై యీవిధంగా కినుకవహించడం శోభగాదు. పెద్దలు పిల్లలతప్పులను క్షమించాలి" అన్నాను. నాయీనమ్రత అతనిలో గొప్పమార్పును తెచ్చింది. ఆతడు సంతోషంతో నన్నుగూడ వాళ్ళగోష్ఠిలో చేర్చుకున్నాడు

ఇట్లు ఐదువత్సరాలు గడిచినై. నాదైనిక జీవనంలో వ్రాయదగిన మార్పు జరుగలేదు. రోజు ఒకసారి బయటికి పోవడానికి మాకు వీలుకలిగేది. అధికార్లు మా నాడి పరీక్షచేసేవాళ్ళు మేము శుభ్రమైనగాలినిపీల్చి, సూర్యభగవానుని దర్శనం చేసికొనేవాళ్ళం ఒంటిస్వభావం మీకు తెలుసునను కుంటాను పదిరోజులకు సరిపడే జలాన్ని అది కడుపులో దాచుకుంటుంది దానికి దాహముయొక్క

స్వభావం బాగా తెలుసు. మేముకూడ మాకు ఒక్క రోజుకు కావలసినగాలి, వెలుతుర్ను స్వీకరిస్తాము మళ్ళా కొట్లోకి వెళ్తాము.

కాలచక్రము తిరుగుతూంది ఒక క్షణంకూడ ఆగదు మేము మాజీవితమంతా అక్కడేగడపాలను కున్నాం కాని ఆశ్చర్యం, ఒకరాత్రి, ఒకగంట అనుకుంటాను ఎవరో పగలకొడుతున్న శబ్దమైంది.

మేము 'స్వాతంత్ర్యం' 'స్వాతంత్ర్య' అని అరుస్తూ లేచాం బంకింబాబుయొక్క స్వేచ్ఛాగానం ముక్త కంఠంతో పాడ మొదలెట్టాం

వందేమాతరం
సుజలాం, సుఫలాం, మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం

---

శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావుగారు, బి.ఎ., బి.యిడి.

(అడిషనల్ జూనియర్ డెప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, ఏలూరు రేంజి)

రాజమండ్రి, జూనియర్ డెప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా బదలీయైనపుడు
శ్రీమార్కండేశ్వర హిందూ ప్రాథమిక పాఠశాల కావించిన
నల్పాహారవిందు సందర్భమున సమర్పింపబడిన

# వీడ్కోలు - పద్యరత్నపంచకము

(రచయిత:- 'వికళాకవి' శ్రీమాన్ కొడకండ్ల వేంకటరంగాచార్య హారితస్, ఏలూరు)

శ్రీకాంతుండు, విధీంద్ర చంద్రధరసంసేవ్యుం, డజేయుండు, సు
శ్లోకుం, డార్తజనావనుండు, హరి, యస్తోకప్రభావుండు, సు
శ్రీకుం, డోముత పేకుమళ్ళ కులసత్క్షీరాబ్ధి చంద్రోదయున్,
శ్రీకామేశ్వరరాయనిన్ మనుచుతన్ కీర్త్యున్నతిన్, కూర్చుచున్.

ఎవ్వానివంశంబు ఇలకీర్తిఁగన్నట్టి । పండితవంశమై ప్రతిభఁగాంచె;
నెవ్వాని తండ్రిగా రింగ్లీషుభాషలో । డీ. లిట్టు. ఎం. ఎ. యల్. టీ. బిరుదుఁడు;
ఎవాని తమ్ముండు ఎం.ఎ. ఆనర్సు. బీ. । యీ.ఓ. యగు,విశ్వనాథుఁడు, సరసుఁ;
డేవాడు మతసంఘసేవకై, యాంధ్రుఁడై । ధరవ్రాసె గ్రంథరత్నము లెనిమిది

ఎవని యాకారమహిమంబు భువనమునకుఁ,
జాటుఁ బ్రజ్ఞానమారంభ సత్యగుణము,
నెవఁడు వొగడొందు శ్రీలఁగామేశ్వరు కృప;
నతఁడు శ్రీ పేకుమళ్ల అచ్యుత సుతుండు,
లలిత గుణుఁడు కామేశ్వర రావు, సుకవి.

కరుణించు చిఱునవ్వు, పసవిడమోవిపై, । నతిథులదీనుల నాదరించు,
కళల నారాధించు, గవులనున్నించుమను, । విద్యాధికుల గౌరవించు, నెపుడు
సంఘసంస్కర్తయై సాటివాధ్యాయాళి । కష్టనష్టముదీర్చి ఘనతఁగాంచె,
నిష్కళంకాత్ముఁడై నిష్ఫలాపేక్షతో । సత్కార్యముల సదాసల్పుచుండు,

ప్రాథమిక పాఠశాలల పాడుఁబోక,
విద్యకొక వన్నెఁదెచ్చిన విమలయశుఁడు;
అట్టి యధికారి బదిలీయై యాగుచుండ,
ప్రేమలాంఛనమిది సమర్పించినాము;
అందుకొనుఁడయ్య, మాయభివందనములు

ఏచటనున్ననుఁగాని మీకేమి లోటు ?
కోదువ, మిము వీడు మందభాగ్యులకు మాక,
మఱువకుఁడు మమ్ము, మీమేలు మఱువలేము,
గుప్తవేదాంతి ! విద్యాకలుజ్ఞ పినైన
నేకపత్నీవ్రతుండ ! కామేశ రాయ ! !
ఆధునిక కవీశా ! విశాలాక్షీపుత్ర ! !
ఒక్కచోటనే సుస్థిరోద్యోగమూచు
నధికమైనట్టి యధికారమమరుఁగాత !
ఆయురారోగ్యభాగ్య భోగాదులంది
శివత వర్ధిల్లఁ గీర్తి యాశ్రితమ యాత ! !

దక్షిణపువీధి, ఏలూరు.
19—3—1942

ఇట్లు,
తమ అత్యంత విధేయులు,
మేనేజరు & ఉపాధ్యాయవర్గము.

N. B: ౨ లో: 1 పాతపాటలు, 2. కలువలు, 3 జానకిప్రేమ మొదలైన చిన్నకథలు, 4 వాడుక భాష—రచనకు కొన్ని నియమములు, 5 పాలపిట్ట, 6. మిణుగురుపురుగు, 7 సాంప్రదాయిక విజ్ఞానం, 8. వెలుగు.

---

# కంటిభద్రత

(గంపా సూర్యప్రకాశరావు)

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అని ఆర్యోక్తి, జీవరాసులన్నిటికి కన్ను ఉన్నప్పుడే సుఖదుఃఖాది ద్వంద్వానుభవముండునని ప్రత్యక్షానుభవము.

మరియు,

"కన్నె, మన్నె" అని చెప్పు నొక సామెత గలదు. మన్ను అనగా భూమి అని అర్థము. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అను ఆర్యోక్తి యందలి భావముచే బయల్పడు ఏ ప్రాముఖ్యము భూమాతకు గలదో అంతటి ప్రాముఖ్యము కన్నునకును గలదన్నమాట.

మరొక్క మాటలో:—వృద్ధుడైన ఒక పుట్టుగ్రుడ్డివద్దకు ఒక యువకుడు చేరి

"తాతా పిల్లవాడు పాలుత్రాగి చనిపోయెనని" చెప్పెను.

"అయ్యో, పాపము! పాలెట్లుండును?

"తెల్లగా కొంగవలె ఉండును"

"కొంగ ఎట్లుండును"

"వంకరగా కొడవలివలె ఉండును"

"అట్లనా? కొడవలి ఏరూపమున నుండును"

దానికా యువకుడు తన చేతిని ఛీలనుండ ముందుకు వంచి కొడవలి వంకరను సార్థక పరచుచూ అంధుని తడుముకొని చూచునట్లు హెచ్చరించగా అంధుడు అట్లుచూచి యింతవంకర, పొడవు, పిల్లవాని చంపుటకు సరియైనదని వృథాగా విచారించెను. చూచితిరా కన్నులేని దురవస్థ.

అందువలననే భగవానుడు కూడ కంటి నిర్మాణమును గురించి చాల భద్రత వహించి, సుకుమారమగు రాజునకు రక్షణార్థము దుర్భేద్యమైన కోటవలె సునిశితపు కనుగ్రుడ్డును గట్టిదగు నస్థికగూటిలో భద్రపరచినాడు.

ఇంత ప్రాముఖ్యమగు కంటిని గురించి శ్రద్ధవహించుట, భద్రపడుట, బుద్ధి మంతుల లక్షణము.

ఈ విషయమునగూర్చి యీక్రింద సూత్రప్రాయముగా వివరింపబడెను.

నేత్రరోగము రాగ - నేత్రవైద్యుని చేరు
సూక్ష్మాచ్చు పుస్తకము - చూపును చెరచు
కిలిబిలి అక్షరములు - కన్నుల చెరచు
మిణిమిణ్లు దీపాన - మిక్కిలి చెడు కన్ను
సూర్యకాంతిని చదువ - చూపు పాడౌను
పరుండి చదివిన - పాపలు పాడౌను
నడచి చదివిన వాని - దృష్టియు నడచు
సాంధ్యకాలమునందు - చదువగా రాదు
వెన్నెల చదువున - కన్ను వెలవెలపోవు
పొగపారు దీపము - పాపలను చెరచు
కుడివెలుగు పుస్తకముపై నున్న - కుంటుపడును దృష్టి
కాంతి హీనపు దివ్వె - కంటికి కంటకము
వెలుతురు లేకుండ చదువ - వేడెక్కు కన్ను
ముఖము దగ్గర చదువ - ముప్పు తెచ్చు కంటికి
దినములో దీర్ఘముగ చదువ - దృష్టి చెడును
కంటిలో నలుసున్న - కన్నులు నలుపకు
వేళతప్పి నిద్ర - వేగించు దృష్టి

వేళకు తినకున్న - వేడెక్కు కన్ను
పరిశ్రమ లేకున్న - పాడౌను కన్ను
పుష్టిగల అన్నాన - పొలుపొందు కన్ను

---

# పారిశ్రామిక మండలము లేర్పడుటకు వలయు పరిస్థితులు

వేదుల అన్నయ్యశాస్త్రి

1. పరిశ్రమలు వృద్ధియగుటకు ముడిసరకులు చాలనవసరము. అట్టివి. పారిశ్రామిక మండలములందు దొరకునేర్పాటు లుండవలెను. అవి ఆ ప్రాంతమందు దొరకనిచో సులభముగా తెచ్చుటకనువగు పరిస్థితులైన నుండవలెను.

2. ముడి సరకులు వస్తువులుగా తయారగుటకు యంత్రములతో గూడిన కర్మాగారము లెక్కువగా నుండవలెను. అట్లున్నప్పుడే వస్తూత్పత్తి విరివిగానగును

3. మిల్లులలో పనిచేయుటకు కూలీలు ఎక్కువగానుండవలెను.

4. తయారైన వస్తువులు ఎగుమతి యగుటకు మంచి రేవులుగాని, నౌకాశ్రయములుగాని, ఇనుపదారులుగాని యుండవలెను.

5. శీతోష్ణస్థితిగతులుకూడ అనుకూలముగనుండవలెను.

6. వ్యాపారమునకు తగిన రాకపోకల వసతు లుండవలెను.

7. అన్నిటికంటె జలసమృద్ధి చాలయనవసరము. దీనివలన ఆవిరి తయారగును. ఆవిరిసహాయమున యంత్రము లు పనిచేయును.

8. పారిశ్రామిక మండలములలో పనిచేయు కూలీలకు వలయు ఆహారపదార్థములు, దిగుమతియగుటకు తగిన సౌకర్యములుండవలెను.

ఇన్నియున్నగాని యేదేశములోనైనను పారిశ్రామిక మండలము లేర్పడవు.

---

# వత్సలామోదము

[పసుపులేటి రామకోటయ్య]

నాది ప్రస్తుతనివాసము సత్తెనపల్లి. కాని నాస్వగ్రామము తెనాలి. గుంటూరుజిల్లాలో వ్యాపారమునకు రాకపోకలకు ప్రధానస్థానమై పేరు గన్నది తెనాలినగరమే. నాకు చిన్నతనములో నేను రోజున్నూ రాత్రిళ్లు భోజనము పెందలకడ ముగించి యెవరైనా చిన్న చిన్న కథలు చెప్పుతూంటే వినడం నాకు అదో సరదాగా యుండేది. నా కప్పుడు యెనిమిది సంవత్సరాలుండేవి. రాత్రిళ్లు పుస్తకం పట్టడం అలవాటే లేదు. కథలు వినడం, నిద్రపోవడం తెల్లవారుఝామున లేవడం, పుస్తకము

తీసికొని బడికి వెళ్ళేంతవరకు చదవడం నా నియమము. తరువాత భోజనంచేసి బడికి పోయేవాణ్ణి

మా యింటిప్రక్కయింట్లో 50 యేండ్ల ఒక ముసలాయన వుండేవాడు ఆయన పగలంతా భగవన్నామము చేసి దీపాలు పెట్టగానే యిద్దరు ముగ్గురు పిల్లల్ని చుట్టూకూర్చుండ బెట్టుకొని చిత్రమైన కథలను చెప్పివాళ్ళను నవ్వించి వాళ్ళతోపాటు తాను నవ్వి కొంత సంతోషాన్ని పొందడం ఆచారం నాకు కథలు వినడంఅంటేనే సర్దాగదా అందులో తెనాలి రామలింగని కథలు వినాలంటే నేను భోజనముసహా మానుకుండేవాణ్ణి మీరు నమ్మండి నమ్మకపోండి. సమయానికి జ్ఞాపకానికి వచ్చింది కాబట్టి నేను విన్నకథలలో నొకదానిని యిప్పుడే వివరిస్తాను

బాలకులారా! శ్రద్ధగా వినండి!

తెనాలి యిప్పుడు పెద్ద నగరము అయిందిగాని 400 యేండ్ల క్రితము (అనగా 15 వ శతాబ్దములో) చాల చిన్నయూరుగా నుండేదని మీరే గ్రహిస్తారని నమ్ముతాను. తెనాలికి సమీపంలో గార్లపాడను ఒక చిన్న గ్రామము వుండేది. అవూళ్ళో నొక బ్రాహ్మణోత్తము డుండేవాడు. ఆయన యింటిపేరేమిటో తెలియదుగాని ఆయన పేరు రామయ్యపండితుడు. ఆయన సాధ్వీమణియైన లక్కమాంబను వివాహము చేసికొన్నాడు కొన్నాళ్ళకు వారికి నొక చక్కనిపిల్లవాడు గలిగినాడు స్వగ్రామము గార్లపాడు అయినా తండ్రి తన కుటుంబముతో వచ్చి తెనాలి పురములో నివసిస్తూయుండేవాడు తెనాలిలో ఆయన రామలింగేశ్వరాలయము నొకదానిని కట్టించి పూజపురస్కారాలు చేయిస్తూయుండేవాడు. శ్రీరామలింగేశ్వరుని కృపచేత కలిగిన తన కుమారునికి యిష్టదైవతినామము ను యెల్లప్పుడును స్మరించుటకుగాను రామలింగమను పేరున పిలుస్తూండేవాడు ఇప్పటికిని తెనాలిలో రామలింగేశ్వర పేటయున్నూ ఆ పేటలోనే రామలింగేశ్వరాలయమున్నూ కనిపిస్తూన్నది

రామలింగము చిన్నతనమున బహుచురుకుగలవాడు. పిల్లలను ఆటల్లో నాడించడం, తోడిబాలురను, దారిని పోయ్యేవాళ్లను, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించడం, ఆతని స్వభావసిద్ధములైన గుణములలో నొకటి అందరి పిల్లలను తాను యెట్లా చెప్పితే అట్లావినేటట్లు చేయగలసమర్థుడు. త్రోవను బొయ్యేవాళ్లు సహా ఆశ్చర్యములో నిల్చి ఆతనిమాటలను విని ఆనందించి మరి వెళ్లేవాళ్లు. ఆపిల్లవాడు చిన్నప్పటినుండీ హాస్యగాడైనాడు. రామలింగనికి చెలికాండ్రతో కలిసి నాటకాలలో వేషాలు వేయడం చాల యిష్టము ఒకరోజున అతను శ్రీకృష్ణరాయబారమను నాటకంలో తాను కృష్ణపాత్రను ధరించి వూళ్లోవాళ్లందరిని రప్పించి వారి ముందే వారివారి తప్పులను నాటకములో మిళితముఁజేసి చెప్పేవాడు-అందరువినేటట్లుగాను,తప్పులున్నవాళ్లు తమతమతప్పులను దిద్దుకొని దాటిపొయ్యేటట్లుగాను.

రామలింగము ఒక రోజున పిల్లలందరితోను ఆడుతూ యుండేసమయంలో ఒకసాధు పుంగవుడు వాని ముఖములో నొక విధమైన తేజస్సు ఉందనియు, పెద్దవాడైన తర్వాత చాల గొప్పవాడవుతాడనియు, గ్రహించాడు దారినిపోతూనూ ఆసాధువు పిల్లవానిని యీవలికి పిల్చి ఒక మంత్రాన్ని వాని చెవిలో చెప్పి వెళ్లాడు రామలింగము ఆ మంత్ర ప్రభావాన్ని తెలిసికొనేందుకుగాను ఒక రోజున యేకాంతముగా నొకచోట గూర్చొని పఠించాడు. వెంటనే కాళికాదేవి ప్రత్యక్షమై వానిని "నీకేమికావాలి" అనిఅడిగింది రామలింగన తన కండ్లుబాగా విప్పిచూచాడు భయంకర మూర్తిని భయం యేమాత్రము లేకుండా ఇట్లా అన్నాడు అతను "అమ్మా! నాకు ఒక్కముక్కువుంటేనే జలుబుచేస్తే నాకురెండు చేతులుండికూడ చీదుకోలేక బాధపడు తున్నానే? నీకు వెయ్యి నాసికలున్నవిగదా నీకున్న రెండు చేతులతో నెట్లా చీదుకోగలవో నాకు సందేహముగా యుంది కాన నాయనుమానాన్ని ముందుగా తీర్చుము" అనిఅన్నాడు కాళికాదేవి కోపముతోను, ఆశ్చర్యముతోను నవ్వుతోను, ఆపిల్లవానిని చూచి "రామలింగా! నీవెప్పుడున్నూ యిట్లాగే హాస్యగాడవు అవుతావని" చెప్పి మాయమైంది ఆరోజునుండీ రామలింగము హాస్యగాడైనాడు తెనాలిపురములో

తల్లిదండ్రులు రామలింగనికి ఉపనయనము గావించి చదువుల బడికి పంపారు. చదువుతున్నా తుంటరిపనులను, కొంటెపనులను, మానినాడుగాడు రామలింగడు , ఒకరోజున వాని గురువు విసిగి రామలింగనితో "అబ్బాయీ! యీ నా తుండుగుడ్డల్ని తీసికెళ్లి చెరువులో నుదికి తెల్లగా మల్లెపూలవలె చేసుకొనిరా" అని అన్నాడు రామలింగము గురువు చెప్పిన విధముగా బట్టలను వుదయమునుండి సాయంత్రము వరకు చెరువులో

చీకటి పడేంతవరకు బండమీద వేసి కొట్టుతూనే యున్నాడు. పంతులుగారు రామలింగని కొఱకు వూరంతా వెతికి కనబడక చెరువు వద్దకు వెళ్లి "ఇదేమిరా? యిట్లా నాబట్టలను చింపుతున్నావేమిరా" అని అడుగగా రామలింగము "మీరు బట్టలను తెల్లగా మల్లెపూలవలె ఉయ్యేంతవరకు ఉదుకమన్నారు గదా! అందుకే తెల్లగా అయ్యేంతవరకు వుదుకుచున్నాను" అని చెప్పాడు ధైర్యంగా

రామలింగము ఒకరోజున భక్తిశ్రద్ధలతో సన్యాసి చెప్పిన మంత్రమును మరొకసారి చదువగా కాళికాదేవి ప్రత్యక్షమైంది ఇతనికి ఈసారి దేవి ఒక చేతిలో పాలగిన్నెను, మరియొక చేతిలో పెరుగుగిన్నెను పట్టుకొని "రామలింగా! ఒక చేతిలోనిది పాలు, మరియొక చేతిలోనిది పెరుగు, ఒకటి ఐశ్వర్యమిస్తుంది, యింకొకటి విద్య నిస్తుంది ఇందులో నొకదానిని మాత్రము త్రాగుము" అని చెప్పింది "తల్లీ ఆ రెండు గిన్నెలను యిటు తెమ్ము ఏదిమంచిదో నాకిష్టమైనదానిని త్రాగి రెండవది నీకేయిస్తానని" చెప్పి రెండు పాత్రలను ఖాళీచేసాడు రామలింగము. కాళికాదేవికి కోపమువచ్చి "ఇదేమిరా? నాయాజ్ఞను మీఱి ఒక దానిని పుచ్చుకొనక రెంటిని త్రాగితివి!" అని యడుగగా రామలింగము "మాతా! ధనము, విద్య రెండున్నూ మనుష్యునికి కావలసినవే! ధనముండి విద్యలేకపోయిన మంచిచెడుగులు తెలియని మూఢుడౌతాడు విద్యయుండి ధనము లేకపోయిన యెవరున్నూ ఆదరించేవారు లేరు యీ ప్రపంచములో అందువలన యీ రెండున్నూ నాకు కావలసినవే కాన రెండు పాత్రలను ఖాళీచేసినాను అని చెప్పగా కాళికాదేవి "నీవు యికముందు వికటకవి వగుదువుగాక" అని శపించింది మరల రామలింగము దేవిని వేడగా "నీవు వికటకవివైనను రాజసభలలో మెప్పుపొందగలవని" చెప్పి అంతర్ధానమైనది దేవి

ఆనాటినుండి దేవీ వరప్రసాదము వలన రామలింగము సంస్కృతాంధ్ర భాషలలో ప్రవీణతను బొంది అనేక గ్రంథాలను రచించి మంచిపేరును సంపాదించాడు ఆంధ్రదేశములో కెల్ల శ్రీకృష్ణదేవరాయల నగరంబగు విద్యానగరమున ఆస్థానపండితుడుగా రాజు నాశ్రయించాడు పెద్దవాడై శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవమతస్థుడగుటచేత రాజుగారి మతమును అవలంబించ రామలింగము రాజుగారి ఆస్థానపండితులలో గొప్పవాడైన తాతాచార్యులవారిని ఆశ్రయించాడు తాతాచార్యులు వానితో "నీవు వైష్ణవమతమునకు తగవు" అని చాల కాలము గడిపెను రామలింగము ఆచార్యుల వారిని మరిమరివేడిన "సరేనని గురు కానుకకు నొకకాని నిమ్మని మంత్రమును జపించి రామలింగని కుడిభుజమునకు వాతవేసి కాల్చెను రామలింగడు ఆబాధకు తాళజాలక బజారుల వెంబడి పరుగులెత్తుచు "గురువుల ముద్రల వలన ముక్తికలుగునో కలుగదో కాని నాశరీరమునందున్న వ్రణబాధచేత నా శరీరమునకు త్వరలో తాతాచార్యులవారు ముక్తినిప్పించెదరని" ఆచార్యులవారిని అవమానపరచినాడు

ఈ విషయము వూరంతా పాకింది తాతాచార్యులు తనను అవమానించిన సంగతి రసాస్వాదుగా రాయలవారికి తెలిపాడు.

రామలింగని రాయలవారు సభకు రావించి గురుకట్నమును యిచ్చి వైష్ణవనామమును పెట్టుకొమ్మని చెప్పగా రామలింగము "గురువులవారు నాకు ఒక్క భుజమునే కాల్చారు నాకు పూర్తిగా వైష్ణవత్వము లభించలేదు కావున నాపేరులోని అర్ధభాగమునే మార్చుకొందును" అని ఆ నాటినుండి రామలింగము అను పదములోనుంచి 'లింగము' అను శబ్దమును తీసివేసి "కృష్ణ" అను పదమును కలిపి రామకృష్ణుడను పేరుపెట్టుకొని పిలువబడుచున్నాడు. వానిపేరు మార్పునకు రాయలవారు కడుపుబ్బ నవ్వెను

ఒకనాడు రామలింగము రాయలవారి ఆస్థానములో రాయలవారితో హాస్యమాడ రాజుగారికి కోపము వచ్చి "రామలింగని తలను యేనుగులచేత త్రొక్కించుమని భటుల నాజ్ఞాపించెను భటులు రామలింగని వూరివెలుపలికి తీసికెళ్ళగా రామలింగడే బంట్రోతులకు వుపాయముచెప్పి ఒకగుంటను త్రవ్వించి దానిలో తనతలమాత్రము కనిపించునట్లు పూడ్పించుకొనెను భటులు యేనుగును తెచ్చుటకై వెళ్ళినారు నగరులోనికి ఇంతలో నొక గూనిచాకలి బట్టలు మోసికొనివస్తుండగా రామలింగడు వానితో "అరే చాకలి నాకుగూడ గూని కలదు అందుకే యీ గుంటలో నిల్చున్నాను నాగూని పోయిందేమో చూడమని" చెప్పినాడు. వెంటనే చాకలి రామలింగని పైకితీసి చూచి గూనిపోయిందని ఆ గుంటలో తాను

నిలుచుండెను భటులు యేనుగుతో రాగా రామలింగము లేసందున రాజుగారికడకు వెళ్లారు యీ విషయమును చెప్పుటకు రాయలవారు గోతివద్దకు రాగా గుంటలో గూనిచాకలివాడు వుండుట చూచి ఆశ్చర్యపోయాడు రామలింగని యుపాయమునకు రాయలవారు చాల సంతసించి వదలివేసారు

రామలింగము యిట్లా చాల తమాషాలతో గూడిన యుపాయములను పన్ని వినేవారికి, చదివేవారికి ఉల్లాసము కలుగునట్లు హాస్యకృత్యములను చేసాడు తన జీవితములో. పండితులను, పామరులను, రాజులను సంతోషపరచి ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక దేశములలో పేరెన్నిక గన్నాడు ఈయనను గురించిన కథలు నేడు చాలా భాషలలో వ్రాయబడినవి

రామలింగము రాజుల ఆస్థానములందు పొగడ్తగని తెనాలిపురమును అగ్రహారముగా పొందాడు అచ్చటనే తన నివాస మేర్పరచుకొన్నాడు

గురుకరుణచే సకల విద్యల నేర్చి "కుమార భారతి" అను బిరుదుగూడ సంపాదించాడు. ఈయన పుట్టుకతో శివమతస్థుడైనప్పటికిని పాండురంగ మాహాత్మ్యము గ్రంథమును వ్రాసి వైష్ణవనామమగు తెనాలి రామకృష్ణుడు అను పేరును గూడ పొంది శివకేశవు లను భేదమును పాటించక యేక భావముతో మెలంగినాడు

బాలకులారా! ఇట్టి మహనీయుల చరితములను చదివి అపాయంబులందు ఉపాయములతో మెలగుచు, మతభేదములచే వేరువేరు భావముల బొందక కవులుగాను, పండితులుగాను మీ భావిజీవితమందు పేరెన్నిక గందురని కోరుచున్నవాడను.

---

# "యథాగురుః తథాశిష్యా"

పళ్లా పాపయ్య పాత్రుడు

(1) ఉపాధ్యాయ పదవి లోకములోని అన్నిపదవులకంటెను ఉత్కృష్టమైనదని చెప్పక తప్పదు. ప్రాథమికోపాధ్యాయుడు పసిపాపల భావిజీవితములను క్రమమగు మార్గమున బెట్టుటలో చుక్కాని వంటివాడు. అప్పుడే పుట్టినశిశువు మెదడు అక్షర హీనమగు తెల్లకాగితమువంటిది కాదు. ఆ మెదడున కొన్ని శక్తులిమిడి యుండును; దీనినే పూర్వ జన్మవాసన యందురు. ఎట్టి వెలగలరత్నమైనను సాన బెట్టక స్వయముగా ప్రకాశించదు. అట్లే ఎట్టి తేజోవంతమైన శిశువైనను తగిన బోధనలేక సన్మార్గుడుకానేరడు. గృహము వద్ద పిల్లలకు తల్లిదండ్రులు మార్గదర్శకులుగ నుందురు. బడిలో నుపాధ్యాయుడు గూడ నట్లే మార్గదర్శకుడై వారికాదర్శ పురుషుడై తనవిధిని మరువక తనవశము జేసిన చిఱుపాపల జీవితములను, భావి దేశాభివృద్ధికర్హముగ చేయవలెను. బాలురకు బాల్యమునుండియు నితరుల ననుసరించుట ప్రధాన సహజలక్షణమైయున్నది. కావున ఉపాధ్యాయుడు వారిల యెదుట కడు జాగ్రత్తగా ప్రవర్తింపవలెను. లేని యెడల వారు మాతృదేశోద్ధరణ కావశ్యకమగు సత్ప్రవర్తనాది సద్గుణములులేక సంఘమునకు కంటకప్రాయులై గౌరవహీనులై ప్రవర్తింతురు. ఇందులకు కారణభూతుడు ప్రాథమికోపాధ్యాయుడని తామెల్లరు తెలుసుకొనగలరు.

(2) రసగ్రహణ పారీణులగు నోపారక మహాశయులారా! నేటి ప్రాథమికోపాధ్యాయులలో ఏస్వల్ప సంఖ్యాకులలో తప్ప మిగిలినవారు వారివిధులను ఏరీతిగ నిర్వహించుచున్నది, ఎవ్విధముగ మార్గదర్శ

కులై యున్నది తోటి ప్రాథమికోపాధ్యాయు డ న గు నేను మనవిచేసినచో నాపై కినుక చెందుట భావ్యముకాదు.

ఉదాహరణమునకై యీాదిగువ పొందు పరచిన యంశములను గురించి సాధారణ ముగ ప్రాథమికోపాధ్యాయులు తమకు తెలియకుండగనే ఎట్లుకల్లలాడు వారుగను ప్రగల్భములు చెప్పువారుగను, సోదరోపాధ్యాయులకండ్లలోదుమ్ముకొట్టి సంఘమున ఎట్టి గౌ ర వ ము న కు పాత్రులగుచున్నదీ గమనించ వేడెదను.

(i) ఒక డిప్యూటీ ఇనస్పెక్టర్ వారు స్కూలునకు హఠాత్తుగా వెళ్ళి నప్పుడు ఉపాధ్యాయుడు ఎచ్చటకో వెళ్ళియుండు -టచే వారిరాకకు పూర్వము గతదినమున విద్యార్థుల హాజరునుకూర్చి బాలురను ప్రశ్నించగా, కొంతమందిబాలురు వారం పదిరోజులనుండి బడికివచ్చుటలేదని తెలియ వచ్చినది ఇంతలో ఉపాధ్యాయుడురాగా ఇనస్పెక్టర్ వారు రిజిష్టరునుచూచి బాలురు తెలిపిన విషయములకు వ్యతిరేకముగా హాజరు గతదినము వరకు గురింపబడి యుండుట గమనించి, అయ్యవారియెదుట ఆయాపిల్లలసంగతి నడుగ గతదినమువచ్చి నట్లును నాడింకను రానట్లును తెలిపిరి. ఆపలుకులు విని పిల్లలు తమలో తాము ముసిముసి నవ్వులు నవ్వుచుండిరి. గమ నించితిరా! విద్యార్థులు బడిలో అబద్ధము లను తమ అయ్యవారినుండి యెట్లు నేర్చు కొనుచున్నారో! అట్టి ఉపాధ్యాయుడు మార్గదర్శకుడగునా?

(ii) మరియొక సంగతి; సంఘసభలకు హాజరై ప్రాథమికోపాధ్యాయులు తమ సహజకల్పనాచాతురీ మహిమను, ప్రద ర్శించుటకు బదులు తమవిధిని నెరవేర్చక తోడి ఉపాధ్యాయుల వ్యాసరాజములనో లేక పూర్వీకుల గ్రంథములనుండి విషయ ములను సేకరించియో మెప్పుగ పొంద దలచి తమయొక్క స్వంత కల్పనరీతిని లోకమున చాటదలచుట తోడిమానవుల కండ్లలో దుమ్ముకొట్ట యత్నించుట ఎట్టి గౌరవభంగ కార్యమో గమనించ వేడె దను. అట్టి ఉపాధ్యాయులు మార్గదర్శకు లగుదురా?

(iii) ఉపాధ్యాయుడు బాలురయెదుట దుర్వ్యసనములను ప్రత్యక్షముగ ప్రదర్శిం చుచు బడిగోడల మీాద చుట్టకాల్చరాదు, సత్యమేపలుకవలెను. అనునీతులు వ్రాసి, బాలురను చుట్టకాల్చకుడనియు, సత్యము పలుకుడనియు ఎన్నిసార్లు చెప్పినను ప్రయో జనమేమి? చెప్పినదొకటి, చేయునదొకటి, ఇట్టి ఉపాధ్యాయుడు మార్గదర్శకుడగునా?

కావున మనముచేయు దుష్కార్య ములు, ఇచ్చుబోధనలు, బాలుర మెదడు లందు అణగియున్న శక్తులను వికసింప జేసి మంచి మార్గములో నిడుటకుబదులు, చెడ్డవారినిగా తయారు చేయుచున్నవి. పిల్లల భావి భాగ్యోదయమున కాదర్శ ప్రాయులుగ నుండవలెనన్న పిల్లలయెదుట ప్రవర్తనలు, వాక్కులు ఆదర్శకముగా నుండవలెను.

"యథాగురుః తథాశిష్యాః" యను నార్యోక్తి తామెరుగనిదికాదు.

---

# ఎయిడెడ్ టీచర్ల ఆర్థిక దుస్థితి

వారణాశి వెంకటసుబ్రహ్మణ్యము

ప్రస్తుత విద్యానిబంధనలనుబట్టి ఎయిడెడ్ స్కూలు టీచర్ల జీతాలు, వారి జీవితాలు కూడ చాల కష్టసాధ్యమౌతున్నాయి. ఈ నిబంధనలను బట్టి చూస్తే విద్యావ్యాప్తిమాట యెట్లాఉన్నా, ఉపాధ్యాయుల యిక్కట్లు మాత్రము హెచ్చిపోతున్నాయి. ఈ నిబంధనలవల్ల తొల్లి టీచర్లకుండే గౌరవమర్యాదలు పూర్తిగా నశించాయని చెప్పకతప్పదు. ఆగౌరవ మర్యాదలెట్లా నశించాయో వేనివల్ల నశించాయో యింకొకసారి ప్రస్తావిస్తాను. ఇప్పుడు మన ప్రధానవిషయమైన ఎయిడెడ్ టీచర్ల ఆర్థికవిషయాన్నిగురించి యోచిద్దాము.

యావరేజి హాజరునుబట్టి టీచర్లకు గ్రాంట్లు ఎస్సెస్‌చేయబడతాయి. కాని యివి క్రమక్రమముగానేకక చౌగండాలకు లోనై కొంతకొంత గ్రహణమైపోయి చివరకు పాదాల్పగ్రహణం క్రింద తయారవుతూఉంటాయి. ఒక్కొక్కప్పుడు సంపూర్ణ గ్రహణాలు పట్టడంకూడ కద్దు. ఈ గ్రహణాలకు కారణమేమంటే (1) బడిలో పిల్లల నెక్కుడుగా చేర్చలేదనే దొకటి (2) 4, 5 తరగతులలో (ఇప్పుడు 2, 3 తరగతులకు కూడా) నిష్పత్తి సరిపోలేదనే దొకటి (3) స్టాగ్నేషను, వేస్టేజి; (4) ఎక్విప్‌మెంటు లోపములు (5) విద్యాలోపములు (6) జనరల్ కట్టు ఇత్యాదిదుష్టగ్రహ స్పర్శవల్ల గ్రస్తమై పోతుంటాయి. ప్రతిసంవత్సరం కూడా యెంత తప్పించుకుందామనుకున్నా యీగ్రహస్పర్శ తప్పటంలేదు.

ఇవిగాక మేనేజర్లకు 15% గ్రాంటు వాటా పంచిపెట్టవలసిన దేకదా? వారు సరిగా ఖర్చుపెట్టక స్కూలు నభివృద్ధిలోనికి తీసికొనిరాకపోయినను ఉపాధ్యాయులకే ముప్పు. కాని సాలుసరి లెక్కలలో మేనేజర్లు పాపము లోటులేకుండా ఖర్చు కలములో 40 రూ/ 50 రూ/లు మొద్దు అంకెలు పడవేస్తూ ఉంటారు. ఇట్లాంటి బూటకాలనే నమ్ముచున్నారుగాని యధార్థాలనంతగా విశ్వసిస్తూవున్నట్లు కన్పించదు సర్కారువారు. ఉపాధ్యాయులెంత శ్రమపడి పనిచేస్తేనేమి సంచిలాభము చిల్లుకూడదీసిందన్నట్లు యీ కట్లు వగైరాలు పోను టీచరుకు మిగిలేది 60% లేక 70% మాత్రమే. పులిమీద పుట్రఅన్నట్లు ఆ రోజు కారోజు క్రొత్తక్రొత్త ఆర్డర్లు వచ్చి ఎలిమెంటరీ స్కూలు టీచర్లను క్రుంగతీసివేస్తున్నాయి. ఇంకను యెట్టిగతి కల్గనున్నదో తెలియకున్నది.

పైగా వీరికి నెలజీతాలురావు. 3 మాసాలపేరు; 4, 5 మాసాలకు బట్వాడాయనున్నా, పేచీలున్న స్కూళ్ళకు మార్చి అంతముననే. ఈలోగా వీరికి పెట్టుబడి పెట్టేవారు, వెచ్చమిచ్చేవారు యెవరు? అరువు యిస్తే గ్రాంట్లువస్తాయో రావో అనేభయం. కూలిచేసుకునేవానికి యీవేళకాకపోయినా మరునాడైనా తన కూలి తనకు వస్తుందనే ధైర్యంఉంటుంది. కాని ఎయిడెడ్ టీచర్లస్థితి కూలివానికన్న అధమాధమముగా నున్నది. సుమతి శతకములో చెప్పబడినట్లుగా యీ నౌకరీ

'అడియాస కొలువు' వలె ఉంది. ఏదో వంక చొప్పున గ్రాంట్లు కోసివేయుటే ప్రధానసూత్రముగా నున్నట్లున్నది. ఒక్క నెలజీతము రాకపోయినను, చండాల ఒత్తిడి ఎక్కువైనను పెద్ద పెద్ద ఉద్యోగులే తహ తహలాడుదురే! అట్టితరి అత్యల్ప వేతనములతో కాలక్షేపము చేయు ఉపాధ్యాయుడెట్లు జీవనము చేయుచున్నాడో దైవమెరుగును గాని అధికారుల కూహించుటకైనను నలవిగాదు.

ఇక ఎయిడెడ్ టీచర్ల స్కేల్సును గురించి ఆలోచింతము. ప్రాథమిక విద్య అనునది అన్ని ప్రాథమికపాఠశాలలలోను సమానమే. ఒకేసిలబస్సు, ఒకే కరిక్యులము. ఒకేవిద్యావిధానము అవలంబింపబడుచున్నను వేతనములలో ఒకదాని కొకటి సంబంధములేదట. కొన్ని ప్రాథమిక పాఠశాలలలో నొకవిధముగాను, కొన్నిటికి మరియొక విధముగాను ఉండుటకు కారణమేమి? ఎయిడెడ్ స్కూళ్ళ విద్యయే బాగున్నదని ఒప్పుకొనుచు శుష్కప్రియాలు చెప్పుచు వీరికి ప్రోత్సాహమీయకుండుట చూడ చాల అన్యాయము. ఒకరి యందు కన్నతల్లిప్రేమయు, మరియొకరి యందు సవతితల్లి ప్రేమయు చూపుచున్నట్లున్నది. ప్రజల నందరను సమదృష్టితో పాలించు నేప్రభుత్వమునకును ఇట్టి ద్వంద్వభావము పనికిరాదు. అఖదరకును ఒకేరకమగు స్కేలు నేర్పాట్లు చేయు టుచిత కర్తవ్యము. ఇతరబడుల కన్నిటికిని హెచ్చుస్కేళ్ళ నేర్పాటు చేయించి మాకుమాత్రము తక్కువస్కేళ్ళ నిప్పించుటేమైనను ధర్మముగా నున్నదా? ఈవిషయము లన్నిటిని ప్రభుత్వము పరికించి న్యాయబుద్ధితో ఎయిడెడ్ స్కూళ్ళకు కూడ స్కేళ్ళను వెంటనే వృద్ధిచేయించి తమయొక్క నిష్పక్షపాత బుద్ధిని వెల్లడించునని నమ్ముచున్నాను.

యథార్థమును వెల్లడించిన అధికారులు కినియకుందురుగాక! గురువు అనుపదమునకు గౌరవము తగ్గకుండగాను, అతడు సుఖజీవయాత్ర చేయునట్లుగాను, ఏర్పాటు చేయించండి. స్కేల్సును సమానముచేసి నెలజీతముల నిప్పించుచు, అసంబద్ధమగు కోతలను తీసివేసి న్యాయము దయ చేయించండి. విద్యాభివృద్ధికొఱకు ప్రోత్సహించండి. సంఖ్యలను జూచి సంతసించకండి.

ఉపాధ్యాయసోదరులారా!

మన ఉపాధ్యాయలోకముయొక్క కష్టనిష్ఠురములను వెల్లడించుకొనుటకును, మన అభివృద్ధికొఱకు పాటుపడుటకును సమకట్టిన వ్యాసములను అత్యుత్సాహముతో ప్రకటించుచున్న యీ పత్రికాధిపతులకు నేను ఎంతయు కృతజ్ఞుడను. నేడే మీ మీ కష్టసుఖములను ధైర్యవంతులై యీ 'ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య' అను పత్రికారాజము ద్వారా ప్రభుత్వమునకు వెల్లడించి కృతార్థులు కండు.

'లోకాస్సమస్తాస్సుఖినోభవంతు'

ఓం తత్సత్.

---

# యూరపు - ముఖ్యపట్టణములు.



తాతాజగన్నాథరావు, హెడ్మాష్టరు. బోర్డు ఎలిమెంటరీస్కూలు - శొంత్యాం.
వేదులఅన్నయ్యశాస్త్రి హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు గురమ్మపాలెం.

"ఓహో ! కాంతా యీయుగ్రవనంబెంతో రమణీయం" అనువరుస.

కాదనగా వీలులేదు - కావలసిన పందెమిదుదు
నదేపటముచూడు బాలకా ॥కా॥

1. బ్రీటిషు సామ్రాజ్యమునకు - ప్రధాన నగరంబై
విదేశవర్తకంబు - విరివిగాను చేయురేవు ॥కా॥
2. రైల్వేజంక్షను ఘనమగు - ఎయిరోడ్రోమునుగల్గి
థేమ్సునదీ ముఖమందున - తేజరిల్లు లండనదే ॥కా॥
3. ఫ్రాన్సుదేశరాజధాని - ప్యారిసు నగరంబల్లదె
సీను, మార్నె, నదులుకలియు - ద్వీపముపైనున్నదదె ॥కా॥
4. రైల్వేజంక్షను ఘనమగు - సౌధరాజములతోడ
నవనాగరికతకు ధరను - నిలయంబని మదినెరుగుము ॥కా॥
5. బెర్లిను నగరంబల్లదె - జర్మనీకి రాజధాని
భవనరాజములతోడను - భాసిల్లుచు నున్నదదె ॥కా॥
6. ఓడరెల్బునదులముఖ - ద్వారంబున యున్నయట్టి
స్టెట్టిను, హాంబర్గురేవు - పట్నములవె గను గొనుమా ॥కా॥
7. రైల్వేకూడలి, మరియును - సైన్సు పరికరంబులాది
విద్యుత్సంబంధమైన - వస్తువులకుపుట్టినిల్లు ॥కా॥
8. రోము నగరమిదిగనుమా - ఇటలీకిదిరాజధాని
ఏడుకొండలకుపైనను - కట్టబడిన దీనగరము ॥కా॥
9. ఉత్తరదక్షిణములగల - రైలుమార్గములకూడలి
క్రైస్తవ సోదరులకిది - యాత్రాస్థలమని యెరుగుము ॥కా॥
10. మాస్కోనగరమును, గనుమ - రష్యాకిదిరాజధాని
ఓకానది తీరమందు - ఒప్పుచున్నది దెగనుమా ॥కా॥
11. ఆర్కేంజలు, లేనిన్‌గ్రాడ్ - వ్లాడివాస్టకోడెస్సా
రైలుమార్గములికియ్యది - జంక్షను గానున్నదదె ॥కా॥
12. ప్రాచీనంబగు నగరము - యంత్రపరిశ్రమలవలన
ప్రాపంచకమందుమిగుల - పేరెన్నికగన్నదదె ॥కా॥
13. స్టాంబోల్ నగరంబల్లదె - టర్కీకిదిరాజధాని
కాన్‌స్టాంటి నోపులని - పిలువబడుచు నుండెడిది ॥కా॥

14. గోల్డైను హార్న్ నెడి - కొండపైనిది నిర్మించబడియె
మార్మోరా బ్లాకు సంద్ర - మార్గమునిది కాయుచుండు ॥కా॥
15. ఆసియ యూరపులమధ్య - సరిహద్దు నగరంబిది
ఘనమగు నౌకా శ్రయమును - గలిగియున్నదదె గనుమ ॥కా॥
16. అవని జగన్నాధరావు - అన్నయ్యా శాస్త్రినేలు
అంబికాహృదయేశు కరుణ - ననవరతము పొందెదీవు ॥కా॥

వ రా:—(పై పాట 1942 సం॥ నూతన భూగోళ సిలబస్సుననుసరించి ఐదవ తరగతికి యుపయుక్తమగునటుల వ్రాయబడినది).

---

## సంక్రాంతి పర్వము

'వి క శా క వి'

(మార్చిసంచిక తరువాయి)

శ్రీమహావికుంఠపు లక్ష్మీ స్త్రభవనపు
టుత్తరద్వారమునఁ బురుషోత్తముండు
దర్శనంబిచ్చి, ముక్తి భక్తతతికినిడ
మూడుకోట్ల దేవతతతి ముచ్చటపడు
శ్రీద ముక్కోటి ఏకాదశీ దినంబు
ముందుగచ్చె, నీకన్న, నీపుణ్యమేమి!
పూత సంక్రాంతి! ముక్కోటిముద్దుచెల్లి!!
నుతులు, నతులివె, నాదు సన్నుతులఁగొమ్ము.
బాజా, భజంత్రి, భజనలు,
రాజిలనృత్యంబు, దేవర జయోత్సవశ్రీన్
బాజారుల నూరేగును
సాజతహారతుల నివ్వసాగఁగ, నూరన్.
ప్రకృతిసతికిఁ గాలపురుషు
కు కృతజ్ఞతఁ జూపఁబుట్టు కూర్మిసుతవు, ఓ
సుకృతి! భవదీయ సౌ
గ్యకృత మహానందమిడి, జయముఁగొమ్ముసదా!
క్రొత్తల్లుఁ డత్తఇంటికిఁ,
దత్తరమున లేనిపోని తళుకుల్ బెళుకుల్
మొత్తములుగ బహుమతులన్
స్వత్తరుణికినిడి మరఁదిని బడుహేళనమున్.

అత్తకు మామకు నల్లుఁడు
బత్తిని వినయంబుజూపు భార్యంబడయన్
ముత్తియమువంటి కొమరిత
కిత్తడివలెనుండు నల్లుఁడేర్పడినను, సం ౩౪
పత్తిఁ గలవాడితండని
అత్తయుమామయును జెప్పి యల్లుకుగోపం
బెత్తునోయని భయపడుదురు
'పుత్తడి ఇతఁ' డందురు తమ ముద్దులయల్లుల్. ౩౫
అత్తటినల్లుని పూజకు
బత్తిరిలేకుంట బావమరుదుల సరసాల్
జిత్తిరికఁబట్టి తెత్తురు
రత్తనముల ప్రోవుఁగాఁగ రహిమీరంగాన్. ౩౬
క్రొత్తల్లుఁడు ముదమున రే
కెత్తఁగ బహుమతుల దీవనిత్తురు బావల్
గ్రొత్త స్వదేశీదోవతులు
నుత్తరియాల్ కండువాలు, నొలికెడిప్రేమన్. ౩౭
క్రొత్తల్లికఁ గ్రొత్తల్లుఁడు
జిత్తజుకేళీవిరాళి స్త్రీసువయో సం
పత్తినిమారెడు మారుడు
ముత్తెములగు ముద్దులె ఋణముక్తి సరసముల్. ౩౮
వివిధరకముల పత్రికానివహమెల్ల
రీవినినుఁగొల్చి చేయుఁబీరికలవినుతి
నట్టినీపై భవంబు నేనెట్టువ్రాతు
నెట్టివారికినైన నిన్నెన్నఁదరమె ?
శ్రీద! సంక్రాంతిభామ! లక్ష్మీవతంస !
దివసంబిమ్ము నన్ను సందిటఁగదించి. ౩౯
మహితపుణ్యవు, సంక్రాంతి! మంగళంబు !!
మహిమ లెన్నంగజాలుదే ? మంగళంబు !!
మహికి నెప్పుడువత్తువో ? మంగళంబు
మఱియు బదిరెండు నెలలకా ? మంగళంబు !!
మహిని నందాకబ్రదుకుదే ? మంగళంబు !!
మహి, జనానందములఁగూర్చి, మంగళంబు !!
మహిత సంక్రాంతి ! కొను, జయమంగళంబు !!
సౌఖ్యసంపూర్ణతిదె, నమస్కారశతము.

# పిలుపు

'విశాఖ కవి'

వెన్నముద్దలివిగో, వేంచేయరా! కృష్ణ!
జున్నుమీగడలివె, జుర్రవయ్య!
తఱిపి కమ్మపెరుగు, దయసేయరా! తండ్రి
గుమ్మపాలు ఇవ్వె, కుడువ రార!
తోడు పెరుగన్నమిది, వెన్నతోడ, నంజ
వోయి! రమ్మ, క్రొత్తదియూరుగాయకలదు;
వేరుమాటలునీకేల? వెఱ్ఱిపాప!
కులుకుచును నుండుమిదె, నీకగోటిముద్దు;
కొసరబోనింక; నిమ్మనా కొక్కముద్దు.

---

# సివిక్సు - ప్రశ్నోత్తరములు

## ఐదవతరగతి

(Copy right to the authors)

వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.
తాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు, కొంర్యాం.

Syllabus Heading—Various parts of the human body - their main functions; Muscles and their movement, digestion and assimilation of food; care of the body.

1. మానవశరీరము నెన్ని ముఖ్యభాగములుగా విభజించవచ్చును? అవిఏవి?

జః-మానవశరీరమును తల, మొండెము, కాలుచేతులు అను మూడు ముఖ్య భాగములుగా విభజించవచ్చును.

2. తలయందలి భాగములేవి? అందలి జ్ఞానేంద్రియములేవి?

జః-తలయొక్క పై భాగము కర్పరమనియు, ముందుభాగము ముఖమనియు, రెండుభాగములుగ నున్నది.

కర్పరమునందు అతి మృదువగునట్టియు, శరీరభాగముల కాజ్ఞలనొసగునట్టియు మెదడుగలదు. ముఖమునందు కండ్లు, ముక్కు, నాలుక, చెవులు అను జ్ఞానేంద్రియము లున్నవి.

3. విభాజకమననేమి?

జః-హృదయకుహరమునకును, గర్భకుహరమునకును నడుమగల గోడవంటి పొరకే విభాజకమని పేరు.

4. హృదయ కుహరమునందలి అవయవములేవి ?

జ:-ఊపిరితిత్తులు, గుండె, గాలిగొట్టము, ఆహారనాళము, గుండెకును, గుండె నుండి ఊపిరితిత్తులకును చెడురక్తమును తీసికొనిపోవు రక్తనాళములును, ఊపిరితిత్తుల నుండి గుండెకు మంచిరక్తమును తెచ్చు రక్తనాళములు మొదలగు రక్తముతో సంబంధించిన అవయవములు హృదయకుహరమున గలవు.

5. గర్భకుహరమునగల అవయవములేవి ?

జ:-గర్భకుహరమున ఆహారముతో సంబంధించినఅవయవములుగలవు. దీనిలో పొట్టయు, పొట్టకు ఎడమవైపున ప్లీహము, కుడివైపున కాలేయము, అడుగున వృక్కములుగలవు. గర్భ కుహరముయొక్క అడుగుభాగమున చిన్న పేగులు, పెద్దపేగులు గలవు.

6. అస్థిపంజర మననేమి ?

జ:-శరీరమందలి మెత్తని పదార్థములగు చర్మము, కండరములు, గుండె, ఊపిరితిత్తులు మొదలగువానిని మినహాయించినచో ఎముకలతోచేయబడిన గట్టిపదార్థముమిగులును. దీనికే అస్థిపంజరమని పేరు.

7. శరీరావయవములకు అస్థిపంజర మెట్లుపయోగ పడుచున్నది ?

జ:-శరీరమునకు ఆకారమును దిట్టతనమును యిచ్చును. మెత్తని భాగములగు కండరములకు ఆధారమగుచున్నది. శరీరమందలి అవయవములను కాపాడుచు, శరీరమును కదల్చుటకు తోడ్పడుచున్నది.

8. అస్థిపంజరము యొక్క పటమును వ్రాయుము ?

జ:- * *

9. మనశరీర నిర్మాణమును గూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ:- మన శరీరము కొన్ని ఎముకలతోను, కండరములతోను నిర్మింపబడియున్నది. శిరస్సునందు 22 మొండెమునందు 64, చేతులయందు 60, కాళ్లయందు 60 మొత్తము 206 ఎముకలచే శరీరము నిర్మింపబడినది.

10. కీలు అననేమి? అందలి రకములేవి ?

జ:- ఎముకలు ఒకదానితో నొకటి కలిసిన చోటునకు కీలు అనిపేరు. ఈ కీళ్లలో కదలునవి, కదలనివి అను రెండు రకములు గలవు.

11. ఏభాగమునందలి ఎముకలు కదలవు ?

జ:- క్రిందదవుడ ఎముకగాక తలయందలి మిగిలిన ఇరువదియొక్క ఎముకలును! ఒకదానితో నొకటి అతకబడి కదలకుండా యుండును.

12. కదలెడి కీళ్లలో గలరకములను ఉదాహరణ పూర్వకముగా వ్రాయుము

జ:- కదలెడి కీళ్లు నాల్గురకములు. 1. బంతిగిన్నెకీలు, 2. మడతబందు కీలు 3. జారెడికీలు, 4. బొంగరపుకీలు.

1. బంతిగిన్నెకీలు:-భుజముకీలు, తొడకీలు.

2. మడతబందుకీలు:-మోచేయి, మోకాలు, అడుగుదాడ, వ్రేళ్లు.

3. జారెడికీలు:-వెనుపూసలు, మణికట్టు.

4. బొంగరపుకీలు:-ముంజేతిని బోర్లించుట, వెలకిలవేయుట, శిరస్సును వెన్నెముకపై త్రిప్పుట యిందుల కుదాహరణములు.

13. కండరముల యావశ్యకత ఏమి? అందలి రకములేవి?

జ:-కీళ్లయొక్క కదలికకు కండరములు అవుసరమై యున్నవి. కండరములు శరీరముయొక్క గోడలను దళసరిగా చేయుట కుపయోగపడును. కండరములలో స్వేచ్ఛాకండరము లనియు, అనిచ్ఛాకండరము లనియు రెండురకములు గలవు.

14. మొండెము నందలి ప్రాముఖ్యావయవములేవి ?

జ: మొండెమునందు ఆహారమును జీర్ణముచేసెడి అవయవములును, రక్తమును శుభ్రపరచి శరీరమునకును పంపించు అవయవములుగలవు.

15. జీర్ణమగుటయనగానేమి ?

జ:- మనము భుజించిన ఆహారపదార్థములు పొట్టలో శరీరాభివృద్ధి కుపకరించు లాగున మార్పుచెంది రక్తములో జేరుటకే జీర్ణమగుటయని పేరు.

16. జీర్ణమండలము యొక్క పటముఁవ్రాసి దానినిగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: నోరు, ఆహారనాళము, పొట్ట, ప్రేవులుకలసి ఒక ఆహారనాళముగా ఏర్పడి యున్నది. దీనిలో వేసిన ఆహారము బయటికి రానేరదు. కాని ఆహారము నీటిలో కరిగి పోయినప్పుడు ఆనీరు బయటకు వచ్చుటకు తగిన రంధ్రములు యీ ఆహారనాళమందు గలవు. మనము తినెడి ఆహారపదార్థములు నీటిలో కరుగవు. జీర్ణమండలములోనికి ఊరిన జీర్ణరసములచే మనము తినిన ఆహారము మెల్లమెల్లగా నీటిలో కరుగునట్లు మారి, శరీరాభివృద్ధికుపచరించుటకై రక్తములో కలియును.

పటము.—— * * *

17. రక్తప్రసరణమనగనేమియో పటముఁవ్రాసి వివరింపుము ?

జ: మనశరీరము నెక్కడకోసినను ఎర్రని ద్రవపదార్థమువచ్చును. దీనికే రక్తమనిపేరు. యీరక్తము శరీరమందంతటను వలయ ప్రసరణము చేయుచున్నది. యిట్టి వలయ ప్రసరణము చేయించుటకు ఎడమచేతి వైపున రొమ్మునొద్ద నొక యంత్రము కలదు. దానికి గుండెయనిపేరు. ఇది శరీరమునకంతకు మంచిరక్తమును పంపించు చున్నది. చెడురక్తమును తిరిగితీసుకొని ఊపిరితిత్తుల యొద్దకు పంపి బాగుజేయించు చున్నది.

పటము:—— * * *

18. రక్తప్రసరణమువలన జరుగుపనులను క్లుప్తముగా వ్రాయుము ?

జ: 1. జీర్ణమండలమునకు బోయి జీర్ణమైన పదార్థమును గ్రహించుట.

2. మూత్రమండలమునకు బోయి మలిపదార్థములను మూత్రముగా వదలుట

3. శరీరమంతకు పోయి పోషణపదార్థములనిచ్చి అచ్చటి మలినపదార్థములను తీసికొనివచ్చుట,

4. చర్మమునకు పోయి మలినపదార్థములను చెమటగా నిచ్చివేయుట.

5. ఊపిరి తిత్తులకుపోయి ప్రాణవాయువును తీసికొని బొగ్గుపులుసు వాయువును వదలుట.

6. శరీరముయొక్క భాగములన్నిటికి జీర్ణమైన పదార్థముల నందచేసి, బలమును, వృద్ధిని కలిగించుచున్నది.

19. కండ్ల కసాయము రాకుండ నెట్లు జాగ్రతపడవలెను ?

జః-కండ్లు చూచుట కుపయోగించును. కండ్లులేనివాడు బ్రతికియుండినను ప్రపంచచిత్రములను ఎంతమాత్రము గ్రహింపలేడు. కనుక ఎక్కువ తీక్ష్ణమగు వెల్తురు చూచుటగాని, చిన్నఅచ్చును చదువుటగాని, తరుచు సినిమాలకు వెళ్ళుటగాని కండ్ల కసాయమును కలిగించును.

20. పండ్లను పరిశుభ్రముగా నుంచుకొనవలసిన అగత్యమేమి ?

జః-పండ్లు ఆహారమునమలుట కుపయోగించును. నోటితో ఆహారము బాగుగా నమలనిచో జీర్ణముకాక అజీర్ణముపుట్టును. అజీర్ణమే వ్యాధులకు మూలకారణము. కనుక ప్రతిమనుజుడును పండ్లనుగురించి శ్రద్ధగై కొనవలెను. ఆహారము భుజించినపిమ్మట నోటిలో నీరుపోసికొని, పుక్కిలించి బాగుగా ఉమియవలెను. అతిచల్లనివస్తువులనుగాని అతివేడివస్తువులనుగాని అతిపుల్లని వస్తువులనుగాని పండ్లకు తగులనీయరాదు.

21. శరీరము నారోగ్యస్థితియం దుంచుకొనుట కెట్లువ్యవహరించవలెను?

జః-అపరిశుభ్ర పదార్థములను తినకుండుట, సరియైనవేళకు భుజించుట, మలమూత్రములను సరియగుకాలములలో విసర్జించుట, శరీరమును శుభ్రముగానుంచుకొనుట, మంచిదుస్తులను ధరించుట, వ్యాయామము చేయుటవలనను శరీరమును మంచి ఆరోగ్యస్థితియం దుంచుకొనవచ్చును.

Syllabus Heading.-Formation of good habits, promotion of health and right conduct; Importance of personal and public health, Food, fresh air, exercise and rest necessary for the human body, Value of different articles of food; Sources of disease and how to avoid them; Common diseases and how they can be prevented.

1. సన్మార్గ ప్రవర్తనమన నేమి?

జః- దుష్టచింతలను దరిరానీయకుండ, సద్గుణముల నవలంబించుట కలవాటుపడుటలో మన మనస్సును తగిన అదుపులో నుంచుటకు నిత్యము మనము చేయు ప్రయత్నములకే సన్మార్గ ప్రవర్తనమని పేరు.

---

# మోక్షమార్గము తెలిసికో !

(పి. నారాయణయ్య - పేర్లపాక)

క్రిందటిసంచికలో ప్రపంచమందుగల నాగరిక దేశములు ప్రాథమికవిద్య నెప్పుడు గమనించినదియు తెలియజేసితిని. దాని ప్రతిఫలము మనమిప్పుడు కన్నులార చూడగల్గుచున్నాము. ఆ దేశములలో వలె మనకెప్పుడు మోక్షము సంభవించును ? ఎట్లు సంభవించును ? మన భారతజాతియు పాశ్చాత్యులయెదుట నెన్నటికి మానవ జాతిగ పరిగణించబడునో తర్కింతము.

ప్రకృతము ప్రాథమికవిద్యపై గవర్నమెంటువారు యేదో ధనసంబంధమైన పూచీ గల్గియున్నారేగాని, మిగిలిన విషయములలో జోక్యము గల్గించుకొనక ప్రజాసంస్థల నెత్తిన పూచీ పడవేయుచున్నారు. ఆసంస్థలు ప్రజోద్ధరణ, దేశౌన్నత్యము అను గొప్ప గుణములవిడనాడి, ఉపాధ్యాయులకు నోటిసహాయమునుగూడ నొనరించక ప్రాథమిక విద్యాబాధ్యతయంతయు బడిపంతులుపై పడవేయుచున్నవి. బడిపంతులు సాధారణముగ, తనకువచ్చు వేతన మత్యల్పముగుటచేతను, ప్రజాబాహుళ్యమున విద్యాభిలాషలేని కారణముననుు, గవర్నమెంటువారు యేమాత్రము దోహదమొసంగకుండుటచేతను, ఏమియు చేయజాలక తనకు వీలైనంత మాత్రము తనపలుకుబడి నుపయోగించుకొని తనబత్తెమునకు మోసమురాకుండునట్లు ఫర్మానాల ననుసరించుచున్నాడు. కావున పంతులుపొట్టను కాపాడుకొనుచున్నాడేగాని దేశమును కాపాడుటకు శక్తిలేమిచే తనయుద్యోగపు గొప్పతనమును నిలబెట్టుకొన లేకున్నాడు. కాబట్టి దేశము విద్యాయుతము కావలెనన్న ప్రభుత్వమువారు ప్రజాసంస్థలవద్దనుండి ప్రాథమిక విద్యను తాము చేతికి తీసికొనవలెను. ఎప్పుడీపనిజరుగునో అప్పుడే దేశము విద్యావంతమగును. ఎప్పుడు విద్యావంతులై దేశౌన్నత్యమును దేశీయులు వాంఛింతురో అప్పుడే మన భారతజాతిని "నల్లగొఱ్ఱె" లనుకొనకుండ మానవమాత్రులుగ నితరదేశములు గణించును. మనకును వాంఛిత సౌఖ్యములు లబ్ధమగును.

కావున దేశము వృద్ధిలోనికి రావలెనన్న ప్రజాసంస్థల యధీనమునుండి ప్రాథమిక విద్యను ప్రభుత్వము స్వీకరింపవలెను. ప్రభుత్వము ధన సహాయమునుమాత్రము చేయునదిగగాక విద్యోద్ధరణకు కావలసిన పూర్తిబాధ్యతలను వహించవలెను. అప్పుడే మనకు మోక్షప్రాప్తి.

— మి. ఈ.

# పంటలు - వసతులు

తాతా జగన్నాధరావు & తాతా పాపారావు



వరుస:—"దేవాదేవా బ్రోవవేమము - దేవరాసుగుణాకరా"

1. పంటలకు కావలయువసతులు - బాగుమీరగ దెల్పెదన్
బాలకా నీవాలకించుము - బాగుగాకదు వేగమే ॥పంట॥
2. అధికఉష్ణము అధికజలమును - సారవంతపు ఒండునేలయు
వర్షపాతంబధికముగను - వరి పంటకుకావలెన్ ॥పంట॥
3. ఎండవానయు అధికముగను - నుండనక్కరలేకనే
చల్లచల్లని స్థలములందున - చాలపండును గోధుమల్ ॥పం॥
4. గోధుమకు వరిపంటలకునూ - ఒప్పుచుండిన వసతులున్
చాలసత్తువ భూమియున్ మఱి - చెరకు పంటకుకావలెన్ ॥పం॥
5. నరసముగు వర్షోష్ణములునూ - సారవంతపునేలయూ
నుండుచోట్లనె పండుబాలక - నూనెగింజలు నిజముగా ॥పం॥
6. సజ్జ, జొన్నా, చోళ్ళ పంటకు - సామాన్యపునేలయున్ ॥పం॥
ఉష్ణమూ, మరివర్షపాతము - ఉండవలె సామాన్యముగను ॥పం॥
7. ఉదకమధికము గల్గుతావుల - ఉష్ణమెక్కువ యుండినన్
పొగాకింపుగ పెరుగురా ధర - పొల్లుకాదుర మాదుమాట॥పం॥
8. నల్లరేగడి భూమియున్ - అధికముగ మరియుష్ణమున్
వానకొంచెము నీరుతక్కువ - వసతికల్గిన పండు ప్రత్తి ॥పం॥
9. అమితవర్షము, కొంచెమెండయు - సారవంతపు నేలలందున
ఇంపుమీర సుగంధద్రవ్యము - లెప్పుడున్ భువిపండురా ॥పం॥
10. అమితశీతలలోయలందున - ఆకు(క్రుల్లి) ఎరువునేలల
సిండువర్షము కురియుచోటన్ - నీరు నిలువనిచోటనూ ॥పం॥
11. తేయాకులు పెరుగుననిమది - తెలిసికొను మోబాలకా
అధికవర్షము, కొండవాలుల - కాఫీ మొక్కలు పెరుగురా ॥పం॥
12. వివిధముగమరి దెల్పనేల - వినుము ముమ్మాటికిని తాతా
సోదరుల నిలబ్రోచుచుండెడి - యిందిరాహృదయేశు సాక్షిగ ॥పం॥

---

# వయోజన విద్య

[ పాటిబండ నాగభూషణరావు, బి. ఏ., బి. ఇడి ]

హిందూసాంప్రదాయము ననుసరించి గృహమునకు తండ్రిపెద్ద. అతనికి విద్యాసంపద, న్యాయ విచక్షణ, పరేంగిత జ్ఞానముండిన, ఆగృహసభ్యులు యజమాని యొక్క అనుభవజ్ఞానమును గ్రోలి సుఖ జీవనమును జేయగలుగుదురు. కాని యజమాని విజ్ఞానములేక నీతిదూరుడై సంఘజీవితమునకు ప్రవర్తించిన, వానియింటిలోనిజనులెల్లరు ఆదర్శప్రాయమగు నాయకునిలేమిచే అజ్ఞానతిమిరమున అధోగతిపాలగుదురు. కావున సంఘజీవితాభివృద్ధికి ప్రతిగృహమేధి నీతిప్రవర్తనుడగు విజ్ఞానిగానుండుట అత్యావశ్యకము.

ఈ సందర్భమున పాశ్చాత్యదేశ పద్ధతుల కొలదిగ విమర్శింపదగును. అచ్చట స్వాతంత్ర్యభానుడు నిరంతరము అజ్ఞానాంధకారమును పారద్రోలి, సర్వదేశీయులను విజ్ఞానులనుగా జేయుటయేగాక, సక్రమమగు దేశనాయకులనుగా తయారుచేయును. పాశ్చాత్యదేశములలోని పెక్కు ప్రభుత్వములవారు తమ దేశభావిసంపద తమ పౌరుల విజ్ఞానముపై ఆధారపడియుండునని భావముతో బాలురకు యుక్తవయస్సు రాగానే తమ పాఠశాలలందు తమ స్వంత ఖర్చులతో వారికి విద్యాబుద్ధుల గరపుదురు. ఇటుల జరుగుటవలననే పాశ్చాత్యదేశములలో విద్యాలేమిగాని, స్వాతంత్ర్యదీక్షలేమిగాని కనుపించదు. అట్టి ప్రాంతములలో సర్వజనులు విద్యాధికులుగానుండి దేశసేవ జేయుటకు సిద్ధముగా నుందురు. ఇట్టి పరిస్థితులుగల దేశములందు 'వయోజన విద్య' అను విషయమే అమలునందుండుట అవసరము లేదు. ఏలనన, సర్వజనులు పిన్నవయస్సులో నుండగనే ప్రభుత్వపాఠశాలలందు నిర్బంధ విద్యాప్రణాళిక ననుసరించి విద్య నభ్యసింతురు.

కాని ఇట్టి పరిస్థితులు మనదేశములో లేవు. నిర్బంధ విద్యా విధానముయొక్క ఆవశ్యకతను ఇటీవలనే మనము గ్రహించుటచే కొలది బాలురు మాత్రమే విద్య నభ్యసించుచున్నారు. కావుననే ఇప్పుడు పూర్వముకంటె మన దేశములో కొద్దిగనో గొప్పగనో విద్యాభ్యాసము జరుగుచున్నది. కాని జపాను, అమెరికా మొదలగు దేశములలోనిది విద్యాభివృద్ధితో మనదేశములోని విద్యాభివృద్ధిని పోల్చిన మనము చాల వెనుకబడియున్నట్లు గ్రహింపదగును.

మనదేశములోని పెక్కురు వయోజనులు విద్యాగంధము లేకుండుటచే, వీరి పోషణక్రిందనున్న పెక్కు పిన్నవయస్కులు విద్యావశ్యకను గ్రహింపజాలకున్నారు. ముఖ్యముగా కాంగ్రెస్‌వారు ఇటీవల ప్రభుత్వాధికార మనుభవించిన కాలమున వీరు వయోజనవిద్యాభివృద్ధికై పాటుబడిరి.

వయోజనవిద్యాభివృద్ధి జరుగుటెట్లో మనము తెలిసికొనుట అవసరము. బాలబాలికలు విద్య నభ్యసించు విధమున మోకాళ్లు వంగని ముదుసలికి పలక, బలపము ఇచ్చిన 'అరువది ఏండ్లువచ్చి చదువుకొనక మట్టి కొట్టుకొందునా?' అని తలచి విద్యా విషయమున నిస్పృహ పొందును. బాలురవలె ఉపాధ్యాయుల ఆజ్ఞలకు బద్ధులై వయోజనులు స్థిరాసీనులు కాజాలక పోవుటచే విద్యాభివృద్ధి పొందజాలరు. విద్యా ప్రచారకులు, సంస్కర్తలు వారి మానసతత్వమును పరిశోధించి వారికి అనుగుణ్యమగు బోధనాపద్ధతుల నమలునందుంచవలయును.

పగటిపూట అంతయు కాయకష్టముచేసి పావలా డబ్బులు సంపాదించి కలియో గంజియో త్రాగి పొద్దు క్రుంకగనే పడిఉండమనుభావించు వయోజనులకు విద్యాసంస్కర్తలు పలకలు, బలపములు ఇచ్చి అక్షరములు దిద్దుడని బోధించిన, వానిని పారవైచి నిద్రించుటకు సంసిద్ధులగుదురు.

ఆరోగ్యశాస్త్రమునుగురించి విద్యాధికులు ఉపన్యాసముల నిచ్చిన వయోజనులు అజ్ఞానులుగా నుండక పోవుటయేగాక, తరచుగా మానవకోటిని కబళించు అంటుజాడ్యములకు గురికాకుండుటకు వీలగును. రాజకీయ విషయములను, ప్రపంచవిద్యా, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను దేశనాయకులు వయోజనులకు ఉపన్యాసములు, నాటకములు, మ్యాజిక్ లేంటర్న్ స్లైడ్స్ (Magic lantern slides) రేడియో (Radio) ద్వారా తెలిపిన వయోజనులు తమకు చదువను వ్రాయను తెలియకున్నను, ద్విగు

శోత్సాహముతో విద్యార్థికనికంటె వేగిరముగ వేశసేవకు బద్ధకంకణులగుదురు.

సామాన్యముగా వ్రాయుటకంటె చదువుట సులభము. ముఖ్యముగా వయోవృద్ధుడు వ్రాయుట కిచ్చగింపడు. ఏలనన, ఇది ఇతనికి గొప్పశ్రమ: వ్రాంతువలయుననిన స్థిరచిత్తము, స్థిరసంకల్పము అత్యవసరము. ఈలక్షణములు వయోవృద్ధున కుండుట అసంభవము.

ఏభాషలోనిఅక్షరములనైనను స్ఫుటముగ,పెద్దవిగ నుండునట్లు అచ్చొత్తించి వానిని వయోజనులచే చదివించిన అక్షరములను దిద్దవలసినఅవసరము లేకుండ వారు వానిని గుర్తింపగలుగుటయే గాక, ధారాళముగా చదువగలుగుదురు. కొలదికాలములోనే సామాన్యపాత్రములను చదువుశక్తికూడ ఈ పద్ధతివలన వయోజనులకు అలవడును. క్రమక్రమముగా వ్రాయుటయందు వీరికి అభ్యాసముచేసిన వారికి విద్యనభ్యసించుటయందుత్సాహముగలుగును.

కాన, వయోజనవిద్య నొసంగుటయందు విద్యార్థుల మానసికతత్వమును గ్రహించి వారికి ఉత్సాహము కల్పించు సులభమార్గములను విద్యాసంస్కర్తలు అనుసరింపదగును.

---

# ప్రభుత్వ ఫర్మానాలు

సర్వీసు రిజిష్టరు లేకుండ నుపాధ్యాయ పదవి యందున్న వారికి గ్రాంటురాదు.

* * * *

రికగ్నిషన్ రూల్సులో(మాన్యుయల్) లోగల హోదాలేని ప్రధానోపాధ్యాయునకు గ్రాంటురాదు. * * * *

డివిజనల్ ఇన్స్పెక్టర్ అనుమతిలేకుండ 5 వ తరగతిని నిర్వహించుచున్నట్టి యుపాధ్యాయునకు సెకండరీ గ్రేడు హోదాలేనిచో గ్రాంటురాదు.

* * * *

3 సం॥లోగా సర్వీసుపూర్తిగాకను, పొడిగింపబడుటకనుమతి పొందియుండకను, యున్నట్టి ప్రొబేషనరీ యుపాధ్యాయులకు గ్రాంటురాదు.

* * * *

ఉపాధ్యాయుని చేర్చుకొనిన మాసాంతములోగా మేనేజరు సదరు ఉపాధ్యాయుని సర్టిఫికేట్లను పరీక్షాధికారిచే సరిచూపించుకొనక పోయినచో గ్రాంటు వేయబడదు. * * * *

అనుమతి పొందకుండ అన్క్వాలిఫైడ్ ఉపాధ్యాయులను చేర్చుకొనినచో గ్రాంటురాదు. * * * *

(ప్రాథమికోపాధ్యాయులు (బ్రాంచిపోష్టుమాష్టర్లుగా నున్నచో క్వినైన్ అమ్మకము సాగింపవలెను.) * * * *

ప్రస్తుతపు యుద్ధసిపాయిల బిడ్డలకు పాఠశాలలందు జీతములుండరాదు. మఱియు నట్టివారు తాలూకా తహసీలుదారు, లేక అంతకుపైబడిన హోదాగలవారిచే అప్రూవుకాబడిన అర్జీ పెట్టుకొనినచో వారికి ప్రభుత్వమువారిచేతలకు సంవత్సరమునకు రు 5-0-0 చొప్పున స్కాలరు షిప్పు యివ్వబడును.

* * * *

## శొంఠ్యాం

తే 21—3—1942 ది శనివారం మధ్యాహ్నము 2 గంటలకు శొంఠ్యాం బోర్డు ప్రాథమిక పాఠశాలాభవనమున స్థానిక మెడికలాఫీసరుగారగు శ్రీ అన్నభుక్త నారాయణస్వామిగారిచే "ప్రధమచికిత్స" ను గూర్చి ఉపన్యాస మొసంగబడినది. సభాప్రారంభమున యథావిధిగా దైవప్రార్థన మీపాఠశాలా సహాయోపాధ్యాయులగు శ్రీ పిళ్ళా పాపయ్యపాత్రుడుగారిచే గావించబడినది. అనంతరము పాఠశాలా ప్రధానోపాధ్యాయుడు ఉపన్యాసమునకు హాజరైన ఆనందపురం, ముచ్చర్ల, గిడిజాల మొదలగు పాఠశాలల ఉపాధ్యాయులకును, స్థానిక మెడికలాఫీసరుగారికి స్వాగత మొసంగిరి. సభ్యుల కాహ్లాదకరముగా నుండునట్లు శ్రీ మెడికలాఫీసరుగారు మృదుమధురమగు భాషను ప్రధమచికిత్సనుగూర్చి విపులముగ నుపన్యసించి, కట్లు (Bandages) మొదలగునవి కట్టుపద్ధతులను Practical గా చూపిరి. అంత్యమున శ్రీ మెడికలాఫీసరుగారికి కృతజ్ఞతాభివందనములు పాఠశాలా ప్రధానోపాధ్యాయు లర్పించుటతో సభ ముగిసెను. అనంతరమున అల్పాహారవిం దొసంగబడినది.

ఇట్లు,
తాతా జగన్నాధరావు.
ప్రధానోపాధ్యాయుడు.

---

## కేంద్రోపాధ్యాయ సమావేశము

### పెందుర్తి (విశాఖపట్నం రేంజి)

తే 14—3—42 ది శనివారం మధ్యాహ్నము 2-0 గంటలకు విశాఖపట్నం రేంజీ స్కూళ్ల డెప్యూటీ ఇన్స్పెక్టరువారగు శ్రీ దేవరకొండ సత్యనారాయణమూర్తి పంతులు B. A. L. T. గారి అధ్యక్షతను పెందుర్తి కేంద్రోపాధ్యాయ సంఘసమావేశము, పెందుర్తి ప్రాథమిక పాఠశాలాభవనమున సమావేశమైనది. శ్రీ అధ్యక్షులు ప్రాపంచక సహజమండలములు ఆయామండలముల భూగోళశాస్త్ర విలువలనుగూర్చి ఉపన్యసించిరి.

వేదుల అన్నయ్యశాస్త్రి
సభ్యుడు - కేంద్రోపాధ్యాయసంఘము - పెందుర్తి

---

